# ముక్తి మార్గము

(ఆధ్యాత్మికము)





కవి కిశోర

గోశికొండ మురారి

## శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యోనమః
## అంకితం



పరమ హంస పరివ్రాజకులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ

రామానుజ చిన్న జీయరు స్వామి

వారికి త్రికరణ శుద్ధితో

ఈ పుస్తకము అంకితమిస్తున్నాను

# శ్రీ గురుభ్యోనమః



## శ్రీ సద్గురు ప్రార్థన

శ్లో॥ గురుర్బ్రహ్మా ర్గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వర ।
గురుస్సాక్షాత్పర బ్రహ్మ్మే తస్మై శ్రీ గురవేనమ ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్
ద్వందాతీతం గగనసదృశం తత్వమస్యాది లక్ష్యమ్
ఏకంనిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతమ్
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తన్నమామి ॥

శ్లో॥ మంత్రమూలం గురోర్వాక్యం
పూజమూలం గురోర్మూర్తిం
ముక్తిమూలం గురోర్కృపం
తస్మై శ్రీ గురవేనమ ॥

జ్ఞాన రత్నములు దాచుటకు శరీరమవసరము అందుకే దీన్ని కాపాడుము

# ముందుమాట

ఆత్మబంధువులారా !

ఈనాటి మానవుడు సర్వశక్త సంపన్నుడై కనబడె సృష్టిని యావత్తు గహించడమేగాక చంద్ర కుజాది మండలాల గుర్తెరిగి ఈ సృష్టిని మించిన మరో సృష్టిని తన శక్తి సామర్థ్యములతో నిర్మించి తాత్కాలిక బిరుదులు వహించి మురిసి పోవుచున్నాడు శాశ్వతమైన బిరుదును తెలియక ఆత్మచింతనలేక అడుగడుగున అవరోధముల నెదుర్కొనుచు చిత్రవిచిత్రమైన ఈ ప్రపంచమున నిత్యానందమును పొందలేక పారమార్థిక చింతన తెలియలేక క్షణ మొకయుగముగ బ్రతుకునంత భారముగ గడుపుచు తన గమ్య స్థానమును గుర్తించక అటు ఉట్టి కందక యిటు స్వర్గమునకందక నడమంత్రపు సిరిచే ఊగిసలాడుచున్నాడు ఆత్మ పరమాత్మలను తెలియని వారందరి తీరు యిదేయని తెలియుచున్నది

అందుకుగాను ప్రతివారు తన్ను తానెరిగి శాంతి సద్గుణాలతో ఆత్మతత్వమును గుర్తెరిగి సుఖించుటకై **ముక్తి మార్గము**"అను పుస్తకము పాఠకులకందించుచున్నాను దీనిని ఆద్యంతమూ చదివి అనుష్టించి ఆత్మానుభవమును పొంది తాము తరించి ఇతరులను గూడ తరింప చేస్తారని నేనాకాంక్షిసున్నాను

సదా మీ సేవలో

గ్రంథకర్త

**గోశికొండ మురారి పంతులు**

**తల్లి ఎంతటి దుర్గుణవంతురాలైనను ఆమెను దూషించినచో పిల్లివై పుట్టెదవు**

## సర్వేభ్యో మహో సద్గురుభ్యోనమః




# ప్రార్థన

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుదేవో మహేశ్వర: ।
గురుస్సాక్షాత్పర బ్రహ్మే తస్మై శ్రీ గురవేనమ: ॥

శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్ ద్వంద్వాతీతం గగనసదృశం తత్వమస్యాది లక్ష్యమ్
ఏకంనిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతమ్ భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తన్నమామి ॥

శ్లో॥ మంత్రమూలం గురోర్వాక్యం పూజామూలం గురోర్మూర్తిం
ముక్తిమూలం గురోర్కృపం తస్మై శ్రీ గురవేనమ: ॥

Jna pith Awa d
**Dr C Narayana Reddy**
M
CHAIRMAN
**Andhra Pradesh St t ( Hu al ( ) )**
**Government f A dh P adesh**
Kalabh van Hyd rabad
Phone (O) 214603 R 354845
Fax (O) 214603



డాక్టర్ సి. నారాయణరెడ్డి
ఛైర్మన్
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి
ఫోను 214603
ఫాక్స్ 2 4603

10 1 200

అభిప్రాయం

కవిలో ఒక కాల్పనికుడున్నాడు ఒక దేశికుడున్నాడు దేశికుడుగా కవి సూక్తులు వెదజల్లుతాడు నీతి నియమాలని ప్రబోధిస్తాడు

శ్రీ మురారి [illegible] సూక్తి [illegible] లో దేశికుని విశిష్ట స్వరూపం ప్రతిఫలిస్తుంది [illegible] వెన్నెల్ని సూక్తులను పంచుతున్నారు [illegible] చాలా సంతోషం

సి.నా.రె

చిరునామా

శ్రీ జి. మురారి [illegible]
9-2-87/71
పద్మనగర్
సిరిసిల్ల 505301
కరీంనగర్ జిల్లా

కవితా గంగోత్రి-సరస్వతీ సత్పుత్ర
డా॥ మేడసాని మోహన్
M A Ph D D Litt
డైరెక్టర్-అన్నమాచార్య ప్రాజెక్ట్ తిరుపతి

# భక్త కరదీపిక

భగవన్మహిమాను వర్ణనము-భగవన్నుతి మానవునికి సార్థక ఏర్పడుతుంది చిత్త శాంతి నొసగే ఈ భగవద్గత చింతన అనేక విధములుగ దర్శనమిస్తుంది

భక్తియనెడి పుష్పము వికసించిన
భగవానుండు దయించునురా!
ముక్తిని ప్రేమగ నీకొసగినచో
ముదమున విముక్తుడగుదువురా! (ము మా-పుట-5-పద్యం 27)

అని శ్రీ కవి కిశోర గోశికొండ మురారి పంతులు సత్యమైన ముక్తి మార్గాన్ని తెలియజేశారు ఇది అక్షర సత్యం భక్తుడు ఎప్పుడు ముక్తి కొరకు తాపత్రయం చెందడు

యది భవతి ముకుందే భక్తిరానంద సాంద్రా
విలురతి చరణాబ్జే మోక్ష సామ్రాజ్య లక్ష్మీ.....

అహేతుక భక్తి కలిగిన భక్తునికి ముక్తి చింతన అనావశ్యకం ముక్తి భక్తికి దాసానుదాసి

మనస్సు మౌనము వహించినపుడే
మాధవు పలుకులు వినబడురా!
జ్ఞాన దీపికతో కర్మ మార్గమును
పూని నడుచుచు మెలగుమురా! (పుట-28-పద్య 166)

భగవద్విషయాను సంధానమునకు జ్ఞానదీపిక యొక్క అవశ్యకత యున్నది ఇందుకు కర్మ మార్గము స్వీకరణీయమని పేర్కొన్న పంతులు గారి అభిప్రాయం వీరి కున్న ఆర్ష సంప్రధాయాను మార్గా నక్తిని తెలియజేస్తున్నది

ఈ పొత్తములో మార్కండేయుడి యొక్క కథను చక్కగా తీర్చిదిద్దారు దీనికి అనుబంధంగా శివ, విష్ణు శక్తి పారమ్యములైన స్తోత్రాలను కూడా ఇందులో పొందు పరచారు భాగవతులకు నిత్యము ఈకృతి హస్తభూషణమని భావిస్తున్నాను

ఇద్ది పుణ్యాకరంబని యెపుడు జనులు
కష్ట మనక పఠించిన గలుగు ముక్తి-

భవదీయ

[signature]
30/12/08

బృహత్ ద్విసహస్రావధాని బ్రహ్మశ్రీ
**డా. మాడుగుల నాగఫణి శర్మ**
ఎం.ఎ. పిహెచ్.డి
అధ్యక్షులు




అధికార భాషా సంఘం
సంప్రీతి (ఎల్ బ్లాక్) భవనం
సచివాలయం హైదరాబాదు

దూరవాణి
© కార్యా 345 2339
ఇల్లు 7567726

సులభ శైలిలో సూక్తి సుందర బంధురంగా మురారి పంతులుగారు ఈ ముక్తి మార్గ కావ్యాన్ని గేయాకృతిగా రచించారు

శ్రీపతి నెలప్పడు మనస్సులో అనే పల్లవిలాంటి మకుటం పున పున అవృత్తమవుతూ రెండువందల యైభై రెండు చరణాలుగా ఈ ఖండిక అఖండంగా సాగింది భగవంతుడు భక్తి ప్రేమ ఆత్మ శుచి సత్యము ఔదార్యం ఔన్నత్యం క్రియాశీలం వైరాగ్యం అధికారం ఆరోగ్యం - మనస్సు మానవత్వం ఇలా అలలు అలలుగా ఎన్నో లౌకిక పార లౌకిక విషయాలు ఈ గేయ తరంగిణిలో ఓలలాడుతున్నాయి

మార్కండేయ మకుటంతో ప్రారంభమయిన రెండవ గేయ ఖండిక 72 చరణాలుగా 72 మేళ కర్తలుగల సంగీత సామ్రాజ్యాన్ని తలపిస్తున్నది మొదటి గేయానికి రెండవ గేయానికి గతి భేదాన్ని కూడా పంతులుగారు చూపించారు

మురారి చూపిన మూక్తి మార్గము
బిరాన కనుగొని తరించరా

అని మొదటి ఖండికలో తన గమనాన్ని గమ్యాన్ని కావ్య ప్రయోజనాన్ని నిర్దేశించారు

'అమితాహ్లాదము పొందెన్
పరిణయములు గావించెన్
పాటు బడగ నూహించెన్
అభినుతించుదము వేగన్
ఈశ్వర ప్రసాద మందున్

ఈ పాదాంతాల్లో ఒక చిత్రమైన గతి భేదాన్ని చూపి కవి ఒక వైవిధ్యాన్ని సౌందర్యాన్ని సాధించారు ఇంకా ఇందులో కొన్ని ముఖ్యమైన నిత్య పఠనీయములైన విశేషాలు పొందుపరిచినారు

ఎన్నో పుస్తకాలు వ్రాసి ఇంకెన్నో వ్రాయగల శ్రీ మురారి పంతులు గారిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను ఆశీర్వదిస్తున్నాను

మహా సరస్వతీ కటాక్ష సిద్ధిరస్తు
ముక్తిమార్గము సూక్తిమార్గము
పాఠకుల కనురక్తి మార్గము
అక్షరానందానుభూతికి
అవ్యయ శ్రీ పద స్వర్గము

25-2-2000
ప్రమాథి మాఘ బహుళ షష్ఠీ శుక్రవారం

(signature)
(మాడుగుల నాగఫణి శర్మ)

Grams TELVERS

Phone Off 040 3234815
040 3236911
Res 040 7037585
Fax 040 3236045

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
# POTTI SREERAMULU TELUGU UNIVERSITY



Prof N Gopi
M A Ph D
VICE CHANCELLOR

Lalitha kala Kshetram
Public Gardens
Hyderabad 500 004 (A P)

## ఈశ్వర సన్నిధికి ద్వారాలు తెరిచిన 'ముక్తిమార్గము'

ప్రపంచ సంస్కృతిలో భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు అత్యున్నతమైనవి ఆదర్శవంతమైనవి ఆచరణీయమైనవి నేటి ఆధునిక యుగంలో అన్ని రంగాలలో సంభవించిన సాంకేతిక విప్లవం వల్ల వేగం పెరిగింది ఈ అదృశ్యమైపోతున్నాయి మనుషుల్లో దైవభక్తి ఆధ్యాత్మిక చింతన కొరవడింది ఈకారణంగా ప్రశాంతమైన భారతీయ ముక్తిమార్గం అన్వేషించవలసిన అవసరం ఏర్పడుతుంది ఈ అవసరాన్ని గుర్తించిన అవధూతలు ఆధ్యాత్మిక గురువులు పీఠాధిపతులు కవులు కళాకారులు సాహితీవేత్తలు సమాజాన్ని ఆధ్యాత్మిక చింతనవైపు మళ్లించి ప్రశాంత జీవన సరళిని మన సంస్కృతి సంప్రదాయాలను భావితరాల వారికి అందించారు సమాజంలోని అన్ని రుగ్మతలకు మూలం మనిషిలో పుట్టే వక్ర ఆలోచనలే ఆధ్యాత్మిక చింతన మనిషిని మనీషిగా మారుస్తుంది మానవతను పండిస్తుంది మానవ సమాజాన్నే స్వర్గం చేస్తుంది జాలి దయ కరుణ వంటి సాత్త్విక భావాలు స్థిరచిత్తం నుండి పుట్టేవే ఈ స్థిరచిత్తం మనిషికి పుట్టుకతో వచ్చేది కాదు ఆయా సామాజపు విలువల్ని బట్టి మూలసిద్ధాంతాల్ని బట్టి అభివృద్ధి చెందుతాయి భారతీయ సంస్కృతి సంప్రదాయాల్లోని మంచిని మళ్ళీ మనకు అందించాలనే ఆశయంతో అనేక గ్రంథాలు వెలువడ్డాయి ఆ కోవకు చెందినదే శ్రీ గోశికొండ మురారి పంతులుగారి ముక్తిమార్గము ఆధ్యాత్మిక గ్రంథం

ఈ గ్రంథంలో సర్వేశ్వరుని సేవలోని పరమార్థం తద్వారా మానవజన్మకు సార్థకత చేకూర్చే మోక్షమార్గానికి దారులు మొదలైన అంశాలకు సంబంధించి 252 పద్యాలున్నాయి ఇంకా శివపురాణంలో ప్రసిద్ధి చెందిన భక్త

మార్కండేయుని జీవిత చరిత్రను తెలిపే 72 పద్యాలున్నాయి ఇంతే గాక మహాయజ్ఞాలలో ఆవాహన జరిపే మహాగాయత్రీ మంత్రాలు 60 శ్లోకాలలో కూడా చెప్పబడిన ఈగ్రంథం ఆధ్యాత్మికతను సులభశైలిలో ప్రబోధించేదిగా ఉంది

శ్రీపతి మనసులో ధ్యానిస్తే పాపాలు పటాపంచలైపోతాయంటూ ప్రారంభమైన ఈ గ్రంథంలో అసత్యమాడకూడదు సజ్జన సహవాసం చేయాలి దానధర్మాలు ఆచరించాలి జీవునిలోనే దేవుణ్ణి చూడాలి అనే బోధలున్నాయి సాధుసంతుల పాదసేవ సత్యం-ధర్మం-శాంతి-ప్రేమ వంటి గుణాలను కలిగి వాటిని ఆచరించాలనీ గోవిందుని స్మరణ శాశ్వత నిధి అన్న అంశాలను కూడా కవి ఈ పద్యాలలో పాఠకులకు అందించారు

ఈశ్వర దీవెనలందాలంటే
ఎప్పుడు ధ్యాన మొనర్చుమురా
నీకిష్టంబౌ నీదైవమునకు
నిత్యము పూజలు సేయుమురా

అంటూ ఈశ్వరధ్యానము ఇష్టదైవపూజ నిత్యం చేయాలంటారు ఈ ప్రపంచంలో అశాశ్వతమైన ధన కనక వస్తు వాహనాలకంటే భగవంతుడే శాశ్వతమైనవాడనీ అతని నామస్మరణమే మానవునికి ముక్తిమార్గమనీ ఈ కవి చెబుతాడు వినయంలేని విద్య శోభావిహీనమనీ అనుభవంలేని పాండిత్యం రాణించదనీ ఏకాగ్రత ఉంటే కార్యసాధన సులభమవుతుందంటారు ఇవన్నీ తెలిసిన విషయాలే అయినప్పటికీ వీటికి ఆధ్యాత్మిక భావనలు జోడించి కవితాత్మకంగా చెప్పడం రచయిత ప్రతిభా సామర్థ్యానికీ భక్తి భావానికీ నిదర్శనంగా నిలిచాయి

సర్వజనాళికి సమానమైనది
శాస్త్రబోధలని తెలియుమురా
గర్వంబనియెడి గుణము తొలగితే
సర్వేశుడు నిను బ్రోచునురా

శాస్త్రబోధన ప్రాముఖ్యతను గర్వం తొలగించుకుంటే ఒనగూర్చే ప్రయోజనాన్ని తెలియజేసింది కవిత భౌతిక సంపదలైన ఆస్తిపాస్తులకంటే ఆధ్యాత్మిక సంపదే తరగనిది అని నిరంతరం ఆధ్యాత్మిక భావాలను పెంపొందించు కోవాలంటారు ఈ కవి ఆధ్యాత్మిక పరమార్థాన్ని-

అధ్యాత్మిక జీవన మారోగ్యము
లలవడునని భావించుమురా
అహంకారమే అనారోగ్యమని
ఆలోచనతో నడువుమురా

ఆరోగ్యంగా జీవించాలంటే అధ్యాత్మిక చింతన తప్పనిసరి అనే సత్యాన్ని తెలియజేస్తున్నారు ఈ కవి

నాలుగు పాదాలతో సాగే పద్యాలలోని ప్రతిపద్యంలో రెండేసి అంశాలను ప్రస్తావిస్తూ వంటి ప్రాముఖ్యతను విశదీకరించారు పాడుకోడానికి హాయిగా అందరికీ అర్థం అయ్యే రీతిలో ఈ పద్యాలు ఉండి దైవచింతనకు ప్రతీకలుగా నిలిచాయి

72 పద్యాలలో శివానుగ్రహంతో జన్మించి ఆచంద్రార్కం చరిత్రలో చిరంజీవిగా నిలిచిన మహాభక్తుడు మార్కండేయుని జీవిత చరిత్రను తెలియజేశాడు కవి కృత యుగంలో జీవించిన మహాముని మృకండున్ని ద్వారపాలకులు సంతానం లేని వారికి సత్యలోకంలో ప్రవేశం లేదని అడ్డుకుంటారు చింతాక్రాంతుడైన మృకండుడు ఇంటిదారిన పడ్డాడు ఇంటికి అతిథిగా వచ్చిన అనసూయదేవికి భార్య మరుధ్వతి సేవలు చేస్తుంది అనసూయదేవి మరుధ్వతిని పిల్లలెంతమందని అడుగుతుంది పిల్లలు లేరనగానే అనసూయ కోపంతో గొడ్రాలిపై అతిథి పూజల గొప్పగ చెసితి వెటులన్ అంటూ- సంతతిలేని వారింట అతిథులకు సన్మానం తగదని వెళ్లిపోతుంది సత్యలోకం నుంచి బాధాతప్తుడై వచ్చిన భర్తకు అనసూయ వలన కలిగిన అవమానాన్ని తెలియజేయడంతో మృకండుడు తపస్సు చేసి శివుని మెప్పించి సంతానం పొందాలని నిశ్చయించుకుంటాడు పిల్లల ఆవశ్యకత పిల్లలు లేని తల్లిదండ్రులు మనోవేదన వారు పడే అవమానాలు తెలియజేయడంతో పాటు ఒక మహాభక్తుడు ఒక వంశానికి మూలపురుషుడు అయిన మార్కండేయుని జన్మకు సంబంధించిన అంశాలను ఈ కథ తెలుపుతుంది

మృకండుని ఘోరతపస్సు ఫలితంగా శివుడు ప్రత్యక్షమై-
శతవత్సరముల దుర్గుణుండగు
సుతుడొక్కడు కావలెనా?
మతిమంతుడు అల్పాయుష్యముగల
మాన్యుడొకడు కావలెనా?

అన్న శివుని ప్రశ్నకు-అల్పాయుష్కుడైన మేధావిని ప్రసాదించుమని వేడగా

పదహారేండ్ల ఆయుస్సు కలిగిన బాలుణ్ణి వరంగా ఇస్తాడు చక్రగమనంలో నవమాసాల అనంతరం మాఘమాస శుద్ధతదియ సోమవారం రోజున మార్కండేయుడు జన్మిస్తాడు పెరిగి పెద్దవాడైన మార్కండేయుడు అకాలమృత్యువును తప్పించుకోవడానికి శివుని గూర్చి తపస్సు చేయడం యముడు మార్కండేయుల సంవాదం శివుడు కోపంతో యమధర్మరాజును శూలంతో పడగొట్టడం తిరిగి యమధర్మరాజను బ్రతికించడం-చిరకాలం చిరంజీవిగా జీవించమనీ శివుడు మార్కండేయుణ్ణి ఆశీర్వదించడం చివరికి అతని ధూమ్రమతిని వివాహం చేసుకోవడం పావనయజ్ఞం చేయడం వల్ల భావనుడు జన్మించడం కథాంశం

కమలనాభు దరిదేరి భావనుడు
క్రమముగ తంతుల గొనియెన్
అమల చరితుడా రేకుల తోడ
అద్భుత వస్త్రాల్నేసెన్

అంటూ మహా విష్ణువు తంతులనే వస్త్రాలుగా నేస్తాడు విష్ణువు నుంచి నూలుపోగుల్ని స్వీకరించడం వాటిని జన మానరక్షణకు ఉపయోగించడం అని చెప్పడం వల్ల భౌతిక వాస్తవికతను - ఆధ్యాత్మిక అంశానికి సమన్వయించి నట్టయింది రచయిత సూక్ష్మదృష్టి ఇక్కడ అభినందనీయం ఈ విధంగా మాన రక్షణకు అవసరమైన వస్త్రాలు నేస్తూ సూర్యుని కుమార్తె అయిన భద్రావతిని వివాహమాడి నూటొక్కమంది పుత్రులను కని వారిని పెంచి విద్యాబుద్ధులు నేర్పి వివాహం జరిపిస్తాడు అంతేగాదు-

జగతియందు గల పద్మశాలి వం
శజులకు మేలొనరించన్
ప్రగతి పథంబున నడచుట కొరకు
పాటుబడగ నూహించెన్

అంటూ పద్మశాలి వంశానికి ఉపయోగపడిన వైనాన్ని తెలియజేస్తాడు ఇక్కడ అనాగరిక సమాజానికి గుడ్డకట్టడం నేర్పి నాగరికంగా తీర్చిదిద్దడానికే మార్కండేయుడి నుండి ఈ పద్మశాలి వంశం ప్రాదుర్భవించిందా? అన్నంత స్పష్టంగా కవి ఈ వంశ చరితను విశదీకరించాడు రచయితలో ఆధ్యాత్మిక భావనతో పాటు చారిత్రక సామాజిక దృక్పథం కూడా ఉండడం వల్ల సమాజంలోని కులాల ఆవిర్భావ పూర్వోత్తరాలను స్పృశించగలిగాడు పురాణపరంగా మార్కండేయుడు చిరంజీవి సామాజిక పరంగా పద్మశాలి

వంశం నిరంతరం సేవలందిస్తూనే వస్తోంది మానవసేవే మాధవసేవ అయినప్పుడు పనిలో దేవుణ్ణి చూసుకున్నపుడు మార్కండేయుడు బట్టలు నేసి మనిషి మానాన్నిరక్షిస్తూ సమాజంలో బతికే ఉన్నాడు

ఈ విధంగా పిల్లలులేని మృకండుడు అల్పాయుష్కుడైన మార్కండేయుడిని తపస్సు ద్వారా పొందడం మార్కండేయుడు శివునిచే చిరంజీవిగా వరం పొంది భావనుడిని పొందడం అతని సంతానం వృద్ధి చెంది వారు పద్మశాలి వంశంగా విస్తరించడం ఈ 72 పద్యాలలో వర్ణించబడింది

శివనామస్మరణ సాఫల్యాలను భోళాశంకరుడు తన భక్తులను కాపాడుకునే విధానాన్ని వర్ణిస్తూ సాగిన ఈ ఆధ్యాత్మిక గ్రంథంలో ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రం శ్రీ సాయినాథ స్తోత్రము పరమేశ్వర ప్రార్థన శ్రీ మహావిష్ణువు షోడశనామస్తుతి అష్టాదశ శక్తిపీఠాలు అష్టలక్ష్మిస్తుతి సద్గురుస్తవము నిత్యానుష్ఠానంగా ఉదయం నిద్రలేచింది మొదలు రాత్రి పడుకునే వరకు చేయవలసిన వివిధ నమస్కారాలు ధ్యానాలు మంత్రాలతో నిండిన శ్లోకాలు వివిధ మహర్షుల ప్రసన్నం కోసం జపించాల్సిన శ్లోకాలు బీజాక్షరాలను జపించడం వల్ల కలిగే ప్రయోజనాలు నవగ్రహ ఆరాధనా విధానం నవగ్రహ జపబీక్షరాలు ఏరాశులు వారు ఏ రత్నాలు ధరించాలి వాటి ఫలితాలు ఉపాసన - దీక్ష ప్రక్రియలు అనుసరించవలసిన విధానాలు మొదలైన అనేక విషయాలను ఈ గ్రంథంలో కవి పాఠకులకు అందించారు

అన్ని జన్మలలో మానవ జన్మ ఉత్తమమైనది ఈ జన్మ ఎత్తిన ప్రతి ఒక్కరు తమ జన్మ సార్థకం చేసుకోవడానికి అనంతరూపుడైన ఆ సర్వేశ్వరుని స్మరించి తరించి ముక్తి నొందాలన్నది కవి ఆకాంక్ష వైదిక విద్యాభివృద్ధికి నిరంతరం కృషి చేస్తూ జ్యోతిష వాస్తు ప్రశ్న హస్తసాముద్రిక సంఖ్యాశాస్త్రాలలో నైపుణ్యంగల ప్రసిద్ధ పురోహితుడు అయిన శ్రీ గోశికొండ మురారి పంతులుగారు చూపిన ఈ ముక్తిమార్గము ఆధ్యాత్మిక అంశాలను ఆకళింపుచేసుకొని ఆచరించి పరమేశ్వరుని కృపకు పాత్రులు కావలసిన అవసరాన్ని తెలియజేస్తుంది

ఇటువంటి ఆధ్యాత్మిక గ్రంథం సమాజానికి అందించిన మురారి పంతులుగారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను

గోపి

(ఎన్ గోపి)

బ్రాహ్మీవిభూషణ అవధాని శిరోమణి
**అష్టకాల నరసింహరామ శర్మ**
**శ్రీ సరస్వతీ క్షేత్ర నిర్మాత**
శ్రీ సరస్వతీ యజ్ఞ సేవాసమితి సంయోజకులు

శ్రీ సరస్వతీ క్షేత్రము
అనంతసాగర్
సిద్దిపేట డివిజన్
మెదక్ జిల్లా - 502 267

*Astakala Narasimha Sharma*
Sree Saraswathi Kshetram Ananthasagar SIDDIPET DIVISION Medak Dist 502 267

కరీంనగర్ జనపదములో సిరిసిల్ల ఒక మండలము ఇక్కడ లబ్ధ ప్రతిష్ఠులగు కవులెందరో కలరు అందు శ్రీ మురారి గారు పౌరోహిత్య వృత్తి నవలంబించి యుండుటచే మురారి పంతులు అని పిలువబడుతారు అనర్ఘరాఘవము రచించిన మురారి స్ఫురణకు దెచ్చు నీ పేరు పంతులు అను దానితో కలిసి వీరేశలింగం పంతులు గారిని స్మరణకు దెచ్చును

ధార్మిక తాత్విక భక్తి విచారముతో మాత్రా ఛందములో ధారా పాతముగా సాగినది వీరి కవిత ఇది సులభముగా పాడుకొనుటకు వీలు కలిగి దురవగాహమైన తత్వముననోల లాడించును

వీరు మాత్రలలో మొదటి మూడవ పాదములలో 16 మాత్రలు రెండవ నాల్గవ పాదములలో 14 మాత్రలు వేసి ప్రబోధ ఫక్కికి ఒక ఊపు కలిగించిరి మొదటి పాదమునకు రెండవ పాదాదిని యతి యతికుదురనిచో ప్రాసయతి వాడిరి అట్లే మూడు నాల్గు పాదములకును 1-3 పాదములలో ప్రాసనియమమును పెట్టుకొనిరి ఇట్టి గేయములందీ నియమము సామాన్య విధి

వీరీ తత్వములను కేవలము ప్రబోధము కొరకు గాక తన్మయ భావముతో చెప్పినట్లు తోచును స్వకీయానుభూతులును పెల్లుగా తోచగలవు

లెక్కలేని జన్మాల ఊబిలో

చిక్కు పడియు జంతించకురా!

భక్తియనెడు పుష్పము వికసించిన

భగవానుండుదయించునురా!! (భగవద్వాసన పరిమళించునురా అనినబాగుండిది)

అష్టైశ్వర్యములమరియుండిన
అవనిలోన సుఖముండదురా!
నల్లని కాలుని పిలుపునకు ముందు
తెల్ల వెంట్రుకలు వచ్చునురా!

వెళ్ళి పోయెడు పిలుపు వచ్చెనని
యుల్లములో భావించుమురా!

ఇట్లుదహరించుచు బోయిన గ్రంథమంతయు నుదహరించవలసి వచ్చును కొన్ని గేయములలో మాత్రలు మారుట పెరుగుట తరుగుట యతి ప్రాసలు వదలుట యతి విషయమున పొరపడుట కొన్ని పాదములు పునరుక్తములగుటకు కవి భక్త్యావేశపరవశుడై చెప్పటయే కారణమని భావించినను అక్కడక్కడలయ భంగము బాధ గలిగించును ఆర్ష అనవలసిన చోట ఆర్ష్య అవసరము కాదేమో? నీయొక్క అన వలసిన చోట నీయొక్క అనక నీదగు అంటే సరి పోయేది ధర్మశౌచదయ ప్రేమ గుణాలు-సమాస పుష్టిలేదోమో?

పుష్పము లాంటిది వేదాంతమ్ము
పూర్ణముగా గమనించుమురా!
విశ్వాసముతో తుమ్మెద నీవై
విడువక గ్రహించు చుండుమురా! అని చక్కగా పోల్చినారు

తెలుగునకున్న అచ్చు తప్పల వ్యాధి బారిని వీరును పడ్డారు బాపు టైపు వాడుట బాగున్నది

మార్కండేయుని చరిత్ర రచన చాల బాగున్నది (16,12 మాత్రలతో) గ్రంథానికి అనుబంధముగా నున్న విషయ విశేషములు కొన్ని అవసరము కొన్ని అత్యవసరము కానివి కలవు అయినను కృషి అభినందనీయము కవిత వ్రాయుట ఒక ఎత్తు అచ్చు వేయగలుగుట ఒక ఎత్తు వానిని అమ్మకమునకు లాభమార్జించుట ఒక ఎత్తైతే కీర్తిని పొందుట పెద్ద ఎత్తు అందుకు దైవానుగ్రహ మొకటి తోడైన అన్నియు సమకూరగలవు జిజ్ఞాసువులకిది మంచి గ్రంథము కవి గారితోధిక రచనలు వెలుగు లోనికి తెచ్చి కీర్తినందుదురుగాక అని అమ్మను ప్రార్థింతును

అంబితమేనదీతమే దేవీ తమే సరస్వతీ అప్రశస్తా ఇవశ్మసి ప్రశస్తి మంబనస్కృధి

అవధాన కళాప్రపూర్ణ అవధాన
శిరోమణి సరస్వతీ శిరోమణి
కవితా సుధాకర కవికేసరి
బ్రాహ్మీవిభూషణ అవధానజ్ఞానభారతి
అష్టకాల నరసింహరామశర్మ-అష్టావధాని
శ్రీ సరస్వతి క్షేత్ర నిర్మాత

తేది 01-02-2000

కనకాభిషేక గజారోహణ హస్తకంకణ
కవి గండ పెండెర సత్కారశాలి
అవధాని పితామహ
**డా॥ సి వి సుబ్బన్న శతావధాని** M A Ph D D Litt

ఫోన్ 52239 కోడ్ 08564
తేది 24-12-1999

# అభిప్రాయము

పంచభూతాత్మకమైన తనువునందు యుండుట సక్తి - దాని నుండి బయట పడుట ముక్తి అట్టి నిర్వృతి నందుటకు వేదశాస్త్రపురాణేతిహాస కావ్య ప్రబంధములు మార్గ దర్శకములు

శ్రీ గోశికొండ మురారి పంతులు గారు కూర్చిన ముక్తిమార్గ మనెడి గ్రంథము అన్వర్థనామ ధేయము సర్వప్రాచీన గ్రంథముల సారమీగ్రంథమున అక్షర రూపమందినది కనుక ఈ గ్రంథము ఉపద్శ్యేస్థానమలంకరించు చున్నది

ప్రాణము కంటే మానము ప్రధానమైనది ప్రాణ రక్షకుడగు అన్నదాత కన్న మాన రక్షకుడగు వస్త్రదాత మిన్న అట్టి వస్త్రదాత యొక్క ఉత్పత్తి క్రమ మిందు పొందు పఱుపబడినది

చరమ భాగము యజన పూజన మంత్ర తంత్ర అనుష్ఠాన విశేష నిబిడీకృతము బాల్యాదిగా ఎల్లరకు అనుష్ఠేయములగు కార్యక్రమము లిందు చక్కగా ఉట్టంకింప బడినవి

ఇట్టి సద్గ్రంథములే భారత సంస్కృతి సౌధ మూల స్థంభములు ఈ గ్రంథము ఏయింట నుండునో ఆయిల్లు సుఖ శాంతులతో వర్ధిల్లు చుండును గృహస్థులు చిరాయురారోగ్య భోగభాగ్యములతో శుభ మంగళాభ్యుదయ విశేషములతో పుత్ర పౌత్రో పరంపరాభివృద్ధితో శోభిల్లు చుందురు

డా॥ సి వి సుబ్బన్న శతావధాని

# అభిప్రాయము

కవికిశోర శ్రీ గోశికొండ మురారి పంతులుగారు నాకు సుపరిచితులే గాక ఆత్మీయులు వీరు సంగీత సాహిత్యాభిమానులై జ్యోతిష్య హస్త సాముద్రిక వాస్తు ప్రశ్న శాస్త్రాభిజ్ఞులై పౌరోహిత్య-నాటక రంగకుశలులై పలువురి ప్రశంసలనందు కొనుచు సాహిత్యోద్యానమున విహరించుచూ కవితా ప్రసూన మాలికల నల్లుచు ప్రజలలో చైతన్యము గలిగించున్నట్టి లఘు కృతులను రచించుటయే ధ్యేయముగా బావించి కొన్ని పొత్తములను రచించి ప్రచురింపజేసి ప్రకటించిరి వానిలో నీరాజన రత్నహారము పూజా పుష్పము దైవారాదన సూక్తి సుద భక్తసూరదాసు చరిత్ర, కవితా వల్లరి విజ్ఞానవీణమున్నగు పుస్తకములు బహుళ జనాదరము పొంది కవితా విశిష్టతను వేనోళ్ళగొనియాడు చున్నవి

ప్రస్తుతము వీరు ముక్తి మార్గము అను గేయ సంపుటిని రచించిరి చతురశ్ర గతిలో సాగిన ఈ సంపుటి యందలి గేయములలో యతిప్రాసనియమములను పాటించి సంస్కృతి సంధి సమాసములను జోడించి అచ్చ తెలగు పదములను సమన్వయపరచి సుభశైలిలో ద్రాక్షాపాకముచే ఆబాల గోపాలమునకు అర్థమగు రీతి మృదు మధుర పదగుంఫనమును చేర్చి ముముక్షువులకు అందుబాటులో నుండునట్టి విశేషపరిజ్ఞాన విషయము లెన్నియో జతపరచి అద్వితీయ గేయ మాలికగా రచించి భక్త జనులకు అందించినందులకు నెంతయో ముదావము ఇందులో

శ్రీపతి నెల్లప్పుడు మనస్సులో చింతన చేయుచునుండుమురా ।
పాపంబులు దరిజేరక తృటిలో - పటా పంచలై పోవునురా ।

అని ప్రప్రథమమున భగవన్నామస్మరణ విశిష్టతను దెల్పిరి శ్రీకారముతో ప్రారంభమైన ఈ గేయ మాలిక సకల సంపన్నిలయమై భక్తజనశ్రోత్ర పేయమై అలరారు చున్నదనుటలో అతిశయోక్తిలేదు

అచ్చటచ్చట ఆధ్యాత్మిక విషయములు గృహస్థాశ్రమ ధర్మము కామక్రోధా ద్యరి షడ్వర్గ జనిత దుష్టభావము దైవారాధన ప్రాశస్త్యము దైవదర్శన మార్గము యౌవన వార్ధక్యముల వలన గలుగు ఫలితము శుష్కవేదాంత వివర్జితము కపట గురు విలక్షణము ద్వైతా ద్వైత విభేదము మున్నగు అనేక విషయములను బోధించుచున్నవి

సర్వస్వము భగవానునకొసగి-శాంత చిత్తమున కుండుమురా।
అనుటచే ( సర్వకర్మ పరిత్యజ్య-మామేకం శరణం వ్రజ అను శ్లోకమును

మరవ బోకు మిక మిరణసమయమున-మాధవ। అనుచు

లుపుమురా!

సరగున నీదరి జేరియుండితా-సాయుజ్యము నందించునురా!

అనులచే కృష్ణ శతకమునందలి

॥కం॥ క్రూరాత్ము డజామీళుడు-నారాయణ యనుచు నాత్మనందను లువన్ అను కందపద్యమును

పరులలోన తప్పులు వెదకాడెడి-పాడు బుద్ధి నీకెందుకురా ?

ఇరవున నీలో నున్న తప్పులే-సరిజేసికొనుచు బ్రతుకుమురా!

అని తెల్పుటచే వేమన పద్యములందలి

తప్పులెన్ను వారు తండోపతండము-ఉర్విజనులకెల్ల ఉండుతప్ప ప్పలెన్ను వారు తమ తప్పులెన్నరు-విశ్వదాభిరామ వినురవేమ

అను పద్యమును-

నీరు పాలలో జేరిన వెంటనే-తీరు మార్చుకొను చుండునురా! నునది హంసక్షీర న్యాయమును

ఎవరికి వారే యమునాతీరే-ఎల్లవేళ భావించుమురా! అనునది

ఎవ్వరు తల్లిదండ్రులు సుతులెవ్వరు బాంధవులు అనుపద్యమును ్మరింపజేయుచున్నవి ఇట్లెన్నియో కలవు స్థలా భావముచే తక్కిన షయముల నుల్లేఖించుటలేదు పాఠకులు గ్రహించుదురుగాక!

మురారి చూపిన ముక్తి మార్గము-బిరానగనుగొని తరించరా!

పరమేశ్వరుని అనుగ్రహముచే-పరమపదము లభియించునురా!

అని తెల్పబడుటచే శ్రీ మురారి పంతులు గారిచే రచింపబడిన ఈ ుక్తిమార్గము అను పుస్తకమును చదువుచు చదివించుచు వినుచు నిపింపజేయుచునున్నవారు తరించుటయే గాక దైవానుగ్రహముచే ంత్యకాలమున పరమ పదవినలంకరింతురని స్వయముగ కవి గారు ల్పుట వలన నేనింతకన్న నెక్కువ దెల్పవలసిన విషయములు లేవని ావించుచున్నాను-

సూక్తులలో

జీవహింస చేయకుము జీవునిలో దేవుని గనుగొనుము

నాస్తిక వాదన చేయకుము-నరుడేనారాయణుడనుము

జగన్మిథ్యయని భావించు-బ్రమ్మ సత్యమని బోధించు

భక్తియే భూషణము-ముక్తియే మూల ధనము

అగుపడునది యంతా అశాశ్వతము-అగుపడనిది యంతా ాశ్వాతము

వృథా చేయకు కాలమును-సదా మరువకు దైవమును
సుఖాలలో కష్టములుండును-కష్టములలో సుఖములుండును

ఇత్యాది సూక్తులు మానవ నిజ జీవితమున కుపకరించునట్టి సుబోధక విషయములతో నలరారుచున్నవి

మార్కండేయ చరిత్రను సంక్షిప్తముగ నెరింగింపదలంచి కవి గారు మాత్రా చందస్సులో గేయ మాలికతో మరుద్వతీమృకండులు సంతాన ప్రాప్తికై పాటు పడిన సన్నివేశము మార్కండేయుని జననము మార్కండేయుని సద్గుణగణము-తపోమహిమ-పరమేశ్వర ప్రసన్నము వివరించుటే గాక మార్కండేయుడు చిరంజీవియైపుత్ర కామేష్టి యాగము చేయుట యాగము నుండి భావనమౌని అవిర్భవించుట అతని వలన వస్త్రోత్పత్తి గావింపబడుట భావనర్షి భద్రావతిని పెండ్లియాడుట వారి వలన పుత్రకామేష్టి యాగము ద్వారా జన్మించిన పుత్రులు పద్మశాలీయులగుట మున్నగు ఘట్టములు సంబోధకముగునట్లు రమణీయముగ వర్ణింపబడినవి-

మరియు గణేశ నారాయణ లక్ష్మి విష్ణు శివ దుర్గ రుద్రాది వివిధ దేవతా గాయత్రీ మంత్రములు భృగు మార్కండేయ గాయత్రీ మంత్రములు అష్టదిక్పాలక-నవగ్రహ గాయత్రీ మంత్రములు ద్వాదశ జ్యోతిర్లింగ-సాయినాథ-పరమేశ్వర-శ్రీ మహావిష్ణు షోడశనామ-అష్టాదశ శక్తి పీఠ-అష్ట లక్ష్మి-సద్గురు స్తోత్రములు నిత్యానుష్ఠానము సుదర్శన-మృత్యుంజయ శ్రీ రామ-శ్రీ కృష్ణాది వివిధ దేవతా మంత్రములు రాఘవేంద్ర-సత్యసాయి-దత్తాత్రేయాది సద్గురు మంత్రములు నవగ్రహ మంత్రములు నవగ్రహ జప బీజాక్షరములు ఉపాసనా దీక్షా ప్రక్రియలు మున్నగు వానిని సేకరించి సవివరముగ భక్త జనుల కుపకరించుటకై ఈ పొత్తమునందు చేర్చబడినవి-

ఇంతటి మహత్తర గేయ కావ్యమును రచించినట్టి శ్రీ గోశికొండ మురారి పంతులు గారు అభినందనీయులు వీరింతటితో తృప్తినొందక లోకోపకార మొనర్చెడి కవితా ప్రసూన మాలికలనల్లి ఆంధ్ర భాషా యోషాగళ సీమ నలంకరింపజేయ గలరని అకాంక్షించుచు నింతటితో విరమించు చున్నాను

ఇట్లు
సిరిసిల్ల సాహితీ సమితి అధ్యక్షులు
కవితిలక-జ్యోతిషకుశల
**దేవత వెంకటరాములు**
తెలుగు పండితులు (రిటైర్డ్)

వెంకంపేట-సిరిసిల్ల
జిల్లా కరీంనగరము 505 301



నా యీ "ముక్తిమార్గము" అను పుస్తకమును అంకితముగ స్వీకరించిన జగద్గురువులు శ్రీమాన్ రామానుజ చిన్నజీయరు స్వామి గారికి

నా పై ఆదరణతో అమూల్యమైన సందేశమును తెలపిన "ద్విశతావధాని" బ్ర॥శ్రీ॥ మాడుగుల నాగఫణి శర్మ గారికి

అభినందనలందించి అమూల్యాభిప్రాయమును తెలిపిన "పద్మభూషణ" జ్ఞానపీఠ అవార్డు గ్రహీత శ్రీ డా॥ సి నారాయణరెడ్డి గారికి

ఈశ్వర సన్నిధికి ద్వారాలు తెరిచిన ముక్తిమార్గమని సుదీర్ఘ వ్యాసము నందించిన శాంత స్వభావులు గౌరవనీయులు శ్రీ ఎన్ గోపి, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము వైస్ చాన్సలర్ గారికి

తమ దివ్యాభిప్రాయము నందించి నన్ను దీవించిన "అవధాని పితామహులు" డా॥ సి వి సుబ్బన్న శతావధాని ప్రొద్దుటూరు గారికి

"భక్తకరదీపిక" అను శీర్షికతో తమ అమూల్యాభిప్రాయము నందించిన శ్రీ డా॥ మేడసాని మోహన్ డైరెక్టర్ అన్నమాచార్య ప్రాజెక్ట్ తిరుపతి గారికి

నాపై ప్రేమతో తగురీతి సలహాలందించి అమృత తుల్యమైన అభిప్రాయమందించిన "అష్టావధాని" శ్రీ అష్టకాల నరసింహారామశర్మ శ్రీ సరస్వతి క్షేత్ర నిర్మాత అనంతసాగర్ గారికి

నాకు సాహితీ సారాంశమందించి సహృదయముతో నన్ను ముందుకు నడిపించుచు సమస్త భావముల నందించిన దయామూర్తులు, గురువర్యులు, "కవితిలక" శ్రీ దేవత వేంకటరాములు సిరిసిల్ల గారికి

మరియు ఆర్థిక సహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి

హృదయపూర్వక కృతజ్ఞతాభినందన చందన మందారాలర్పించు చున్నాను

గ్రంథకర్త

**గోశికొండ మురారి** (పంతులు)

సిరిసిల్ల

ఓం నమో భగవతే వాసుదేవాయ

# ముక్తి మార్గము



రచయిత

"కవికిశోర"

## గోశికొండ మురారి పంతులు

1 శ్రీపతినెల్లప్పుడు మనస్సులో
చింతనజేయుచునుండుమురా
పాపంబులు దరిజేరకత్రుటిలో
పటాపంచలై పోవునురా ॥ ॥ శ్రీ ॥

2 మహాత్ములుపదేశించిన మాటలు
మరవక వినుచు తరించుమురా
ఇహమున గృహస్థ ధర్మంబులతో
మహానందముగా చరించరా ॥ శ్రీ ॥

3 త్రికాలసంధ్యలొనర్చుచునిరతము
త్రిపుటి మహాత్మ్యము కనుగొనరా
సకాల ధ్యానము ప్రాణాయామము
సల్పుచు ఫలితములందుమురా ॥ శ్రీ ॥

4 లెక్కలేని జన్మల ఊబిలో
చిక్కుబడియు చింతించకురా
చక్కనిదీ మానవజన్మంబని
సర్వేశ్వరునిక మరువకురా ॥ శ్రీ ॥

5 విందు విలాసాల్ విడచిపెట్టినీ
బొందిలో ప్రాణము కనుగొనరా
అందగాడవై యున్నప్పటికి
అపమృత్యువు నినువిడువదురా ॥ శ్రీ ॥

6 బంధు మిత్రులే శాశ్వతమనుకొని
భ్రమలోబడి చింతించకురా
ఎందరుండినను వెళ్ళుదురెప్పుడో
సుందరదేవుని కనుగొనరా ॥ శ్రీ ॥

7 పలుకోసమునైన నసత్యమాడకు
పదుగురుమెచ్చగ నడుచుమురా
ధరలో సత్యమె భగవంతుండని
ఎరుగుచుండి జీవించుమురా ॥ శ్రీ ॥

8 సజ్జన సహవాసము దైవభక్తి
సల్పుచు సాధన చేయుమురా
నిర్జన ప్రదేశమునగూర్చుండి
నిరంజనుని ధ్యానించుమురా ॥ శ్రీ ॥

9 ఈశ్వర భక్తి దృఢముగనున్న
ఇబ్బందులు విడిపోవునురా
శాశ్వతమైన సుఖములబ్బుటకు
సదాకృషిని నొనరించుమురా ॥ శ్రీ ॥

10 ఇల్లు పిల్లలిల్లాలును సహితము
ఇబ్బందుల పాల్ జేయకురా
మెల్లగ వ్యామోహంబును వదలుచు
ముక్తి కొరకు తపియించుమురా ॥ శ్రీ ॥

11 స్వల్ప విషయములకై కోపించకు
స్వస్థానంబును మరువకురా
స్వతంత్ర్యముగ పనులన్నియు చేయుచు
స్వలాభమ్ముల గ్రహించుమురా ॥ శ్రీ ॥

12 ఆనందామృత భాండమునీయొక
ఆత్మలోన దాగున్నదిరా
అదిదెలియక యెందెందు తిరిగిన
అలసట జెంది తపింతువురా ॥ శ్రీ ॥

13 సర్వప్రాణుల దాగిన దేవుని
సందర్శించుచు మెలగుమురా
సర్వ మందిరములలో దేవునిగని
సమ భావముతో బ్రతుకుమురా ॥ శ్రీ ॥

14 భోగ విలాసుడవై కోరికతో
యోగాభ్యాస మొనర్చకురా
రోగాలెదురై రోదన గలుగును
త్యాగముతో యత్నించుమురా ॥ శ్రీ ॥

15 ఆశపడినచో పాపమురాదు
అధికాశయె నిను ముంచునురా
వాసిగ భగవద్ధ్యాన మొనర్చుచు
వైరాగ్యముతో మెలగుమురా ॥ శ్రీ ॥

16 ఆకలి దప్పుల సహించుకొనియెడి
అలవాటు లభ్యసించుమురా
ఏకాలంబెటు రానున్నదోయని
చీకాకు జెందుచు నుండకురా ॥ శ్రీ ॥

17 దాన ధర్మములు చేయని చేతుల
దారిద్ర్యము నివసించునురా
పూనిదానములు చేయుచునుండిన
పుణ్యలక్ష్మి వెలుగొందునురా ॥ శ్రీ ॥

18 వర్తమాన జీవనమును మృదువుగా
వశపరుచుకొనుచు నుండుమురా
వ్యర్థమురా పునర్జన్మ విచారము
అర్థమెరిగి చనుచుండుమురా ॥ శ్రీ ॥

19 తెక్కలేని దేవుళ్ళకు మొక్కిన
నిక్కముగా గురి నిలువదురా
చక్కనైన నీ హృదిమందిరము
ఒక్కదేవునికే యొసగుమురా ॥ శ్రీ ॥

20 మనసేకాగ్రత కలుగకున్నచో
మరల మరల యత్నించుమురా
అనువుగ ఈశ్వరానుగ్రహమునకు
అతి శ్రద్ధను వహియించుమురా ॥ శ్రీ ॥

21 వాక్కు చేత కీర్తన మొనర్చిన
వశమై మనస్సు నిలుచునురా
వాసిగ రూపము దర్శనమైన
వచ్చి చేరునిల మోక్షమురా ॥ శ్రీ ॥

22 సర్వస్వము భగవానుని కొసగి
శాంత చిత్తమున నుండుమురా
సర్వము నీవాడైన ఈశ్వరుడు
సదానీతోనె వసించురా ॥ శ్రీ ॥

23 ఇరువది నాలుగు గంటల స్మరణ
విడువక చేయుచు నుండుమురా
ధరలో నిను కడతేర్చెడిస్మరణే
వరమైయున్నది తెలియుమురా ॥ శ్రీ ॥

24 విరక్తి కలిగిన మనస్సునిరతము
విభుని కొరకు తపియించునురా
సరగున నీయొక ప్రభువెవరోయని
స్మరణచేత గుర్తెరుగుమురా ॥ శ్రీ ॥

25 మహానుభావుల సేవలొనర్చిన
మాయా వాసన నశించురా
ఇహమున వాసనలన్నితొలంగిన
ఈశుడు కటాక్ష మిచ్చునురా ॥ శ్రీ ॥

26 ముప్పది రెండు లక్షల జపమును
తప్పక చేయుచునుండుమురా
అప్పుడె నీతల వ్రాతయు మారి
ఆరాధ్యుడవై యుందువురా ॥ శ్రీ ॥

27 భక్తి యనెడి పుష్పము వికసించిన
భగవానుండు దయించునురా
ముక్తిని ప్రేమగ నీ కొసగినచొ
ముదమున విముక్తుడగుదువురా ॥ శ్రీ ॥

28 సత్సంగము నీ వొనరించినచో
శాంతిని గలిగి సుఖింతువురా
సదాచారుల స్నేహము జేసిన
సంశయములు విడిపోవునురా ॥ శ్రీ ॥

29 అన్ని రకంబుల సుఖములుండినను
ఆత్మవిమర్శన మరువకురా
ఎన్నాళ్ళైన యముడేతెంచి
వెంట దీసుకొని పోవునురా ॥ శ్రీ ॥

30 త్రికాల సంధ్యలొనర్చుచుండిన
అకాల మృత్యువు లంటవురా
సకాలమున నీశ్వరుడెదురైతా
సహకరించునని నమ్ముమురా ॥ శ్రీ ॥

ఉపాయమ్మున పని సాధించు! ఉపవాస వ్రతములు చేయు!!

31 అవసాన సమయమాసన్నమైన
అధైర్యమున చింతించకురా
అంతట నిండిన ఆది దేవుడే
ఆధారంబని నమ్మమురా ॥ శ్రీ ॥

32 అనేక జన్మల భోగ వాసనలు
ఆజన్మాంతర ముండునురా
అందుకె అవిరళ ధ్యాన మొనర్చిన
అవి ఎన్నడు నిన్నంటవురా ॥ శ్రీ ॥

33 మనసు చెప్పినది ఆచరించితే
ఎనలేని బాధ గలుగునురా
అనువుగ బుద్ధిగ మెలగుచున్నచో
అల వైకుంఠము దొరుకునురా ॥ శ్రీ ॥

34 నల్లని కాలుని పిలుపునకు ముందు
తెల్ల వెంట్రుకలు వచ్చునురా
వెళ్ళి పోయెడి పిలుపు వచ్చెనని
యుల్లములో భావించుమురా ॥ శ్రీ ॥

35 భోగములందే తృప్తి దొరుకునని
సాగి సాగి తిరుగాడకురా
త్యాగగుణములో తృప్తియున్నది
తనువస్థిరమని ఎంచుమురా ॥ శ్రీ ॥

36 అష్టైశ్వర్యములమరియుండిన
అవనిలోన సుఖ ముండదురా
ఆత్మ దర్శనంబైన క్షణములో
ఆనందము లభియించునురా ॥ శ్రీ ॥

[illegible] మదిప్రేమించు॥

37 ఇది అది అనక కోరికలన్నియు
ఈశ్వరార్పణము సేయుమురా
ఇహపర సుఖములు కావాలంటే
ఈర్ష్యసూయలు విడువుమురా ॥ శ్రీ ॥

38 గోవుల మధ్యన కృష్ణుడున్నడని
గోప్యంబెరుగుచునుండుమురా
పావనమౌ గోపాలుని మదిలో
ప్రార్థన చేసి తలించుమురా ॥ శ్రీ ॥

39 ఈశ్వర దీవనలందాలంటె
ఎప్పుడు ధ్యానమొనర్చుమురా
నీకిష్టంబౌ నీ దైవమునకు
నిత్యము పూజలు సేయుమురా ॥ శ్రీ ॥

30 ఇతరుల తగవులలో నీవిరికిన
ఇబ్బందులె ఎదురౌ గదరా
మతిమంతుడవై మాయతొలంగెడి
మార్గము కనుగును చుండుమురా ॥ శ్రీ ॥

41 మరువబోకు మిక మరణ సమయమున
మాధవా! అనుచు పిలువుమురా
సరగున నీ దరిచేరియుండి తా
సాయుజ్యము నందించునురా ॥ శ్రీ ॥

42 దయాగుణ సంపద స్వర్గసీమ, ని
ర్దయ నరకంబై యున్నదిరా
వయసులోననున్నపుడె దుర్గుణాల్
వదలి సుబుద్ధిగ మెదలుమురా ॥ శ్రీ ॥

43 దేవుడెక్కడో నున్నాడనుచును
దేవులాడి తిరుగాడకురా
జీవుని కలిసి దేవుడుండెనని
నీవు నిజమ్మును దెలియుమురా ॥ శ్రీ ॥

44 మోక్షము పరలోకాల దాగెనని
వీక్షించుచు నాశించకురా
మోహములన్ని విడిచి పెట్టిన
మోక్షము నీదై యుండునురా ॥ శ్రీ ॥

45 వృద్ధాప్యంబనె కాలుడు నీపై
యుద్ధమునకు ఏతెంచునురా
వద్దుర! ఓటమి అంగీకరించి
వాసు దేవుని మరువకురా ॥ శ్రీ ॥

46 ఎక్కువ కాలము బ్రతకాలనుచు
ఏ విచారమును చేయకురా
తక్కువ బ్రతికి చావాలంటు
తప్పు విచారము సలుపకురా ॥ శ్రీ ॥

47 అవిశ్వాసమున చరించుచుండిన
అధోగతి పాలగుదువురా
ఆత్మవిశ్వాసమున్నట్లులైతె
అభివృద్ధిని సాధింతువురా ॥ శ్రీ ॥

48 సూర్యోదయమ్మతో నీ మనస్సు
స్థిర సంకల్ప మొనర్చుమురా
సర్వజీవులను సమముగ జూచే
సద్బుద్ధిని మది పెంచుమురా ॥ శ్రీ ॥

49 నిర్వికారుడైనట్టి దైవమును
నిరతము ధ్యాన మొనర్చుమురా
సర్వగు ఆత్మ స్వరూపము తెలిసి
సత్పురుషుల సేవించుమురా ॥ శ్రీ ॥

50 రాగ ద్వేషపు వలలో జిక్కియు
రోదనలకు గురి గాకుమురా
రాత్రింబవల్లు హరినామామృత
రసపానమునే గ్రోలుమురా ॥ శ్రీ ॥

51 వికసిత వదనుడవై ప్రసన్నముగ
విశ్వాసముతో నుండుమురా
విడువక ధ్యాన మొనర్చుచు నిరతము
విజ్ఞానముతో బ్రతుకుమురా ॥ శ్రీ ॥

52 పలు విఘాతముల జగతిని జూచి
పారిపోయి దు ఖించకురా
ప్రయత్న శీలుడవై పని చేసిన
ఫలితమబ్బి సుఖపడుదువురా ॥ శ్రీ ॥

53 సంసారము భవసాగరమనుచు
చతికిలబడి కూర్చుండకురా
సతతము సాధన సంపత్తులతో
సదా స్మరణ యే మారకురా ॥ శ్రీ ॥

54 ఇతరుల పాపములను ప్రకటించకు
ఈర్ష్యాద్వేషము లెందుకురా
మతిమంతుడవై స్నేహశీలివై
మంచి మార్గమున నడువుమురా ॥ శ్రీ ॥

55 సాధుసంతుల పాదసేవచే
సమస్త దు ఖాల్ నశించురా
సదాచారమున బ్రహ్మచర్యము
సలిపిన వాడు సుఖించునురా || శ్రీ ||

56 మహా పురుషుల శరణు పొందియు
ఇహాములోన కడతేరుమురా
అహంకారమును విసర్జించితే
ఆనందము బ్రహ్మంబగురా || శ్రీ ||

57 ఏకాగ్రతతో సంపదలన్నియు
ఏతెంచు ననుచు నమ్ముమురా
నీకేదవసరమైనదో నిత్యము
రాక మానదని తెలియుమురా || శ్రీ ||

58 అమృతధార లభించువరకు నీ
వవిరళముగ కృషి సలుపుమురా
అమూల్యమైన ఆత్మను కనుగొని
అసంతృప్తి విడనాడుమురా || శ్రీ ||

59 రమ్యమైన ఈ మానవజన్మపు
రహస్యమును గుర్తెరుగుమురా
సౌమ్యము తోడుత దేవ దేవుని
సన్నుతి జేసి తరించుమురా || శ్రీ ||

60 సర్వకాల సర్వావస్థలందున
సదా స్మరణ విడనాడకురా
సత్సాంగత్యముతో చరించుచు
సాత్త్విక గుణమున నడుపుమురా || శ్రీ ||

సత్కర్మల నొనరించు చునిరతము
సద్భక్తుడవై యుండుమురా
సమాజమునకు హితమొసంగుటకు
సాహసంబుతో చరించరా ॥ శ్రీ ॥

భగవంతునికి శరణమొనర్చిన
బాధలెప్పుడు నిన్నంటవురా
భవబంధమ్ములు వీడిపోవును
బ్రహ్మ జ్ఞానము లభించురా ॥ శ్రీ ॥

ప్రతి దినముదయము లేచుసమయమున
పరమాత్మను ప్రార్థించుమురా
ప్రతిదినమున నిద్రించునప్పుడు
పరమేశ్వరుని మరువకురా ॥ శ్రీ ॥

సత్యము ధర్మము శాంతి ప్రేమలు
ఉత్తమ గుణములు తెలియుమురా
ఉత్తమ గుణమే దైవంబునుచు
ఉల్లంబున భావించుమురా ॥ శ్రీ ॥

ధర్మశౌచ దయ ప్రేమగుణాలు
దైవ పాదములు తెలియుమురా
దయాది గుణాంబులలో చరించిన
దైవరూపుడవు నీవేరా ॥ శ్రీ ॥

మధురాతి మధురంబైన సత్యపు
మహాత్మ్యమును కనుగొనవేర
మధురమె సత్యము మధురమె దైవము
మధురమ్మననుభవించుమురా ॥ శ్రీ ॥

67 తరచు తరచు యోచించినప్పుడే
తత్వ విచారము కలుగునురా
తత్వముతోనే బోధపడునది
ఆత్మ సత్యమని ఎరుగుమురా ॥ శ్రీ ॥

68 సత్యరూపుడు సర్వేశ్వరుడు
సత్యవంతులకె చిక్కునురా
అత్యంత ప్రీతినొనరించుచునీ
కాత్మ దర్శనాలాసగునురా ॥ శ్రీ ॥

69 నిత్య కర్మలను సత్యము కొరకె
నీ కల్పిత మొనరించుమురా
సత్యము కంకితమై బ్రతికినచో
సార్థకమ్మ నీ జన్మమురా ॥ శ్రీ ॥

70 సత్యముకెన్నడు చావుజనించదు
సత్యవ్రతముతో నడువుమురా
సమాజమందున సత్యవంతునకు
సాటెవ్వరు లేకుందురురా ॥ శ్రీ ॥

71 జన్మజన్మలకు స్థానమైనది
జగతియంచు మది తెలయుమురా
గమ్యము దైవము గలిగిన దనుచు
గమనించుచు చరియించుమురా ॥ శ్రీ ॥

72 అనిత్యమైనటువంటి జగతిపై
ఆశ విడచి జీవించుమురా
ఆధారము నీకున్న దేవుని
ఆరాధన గావించుమురా ॥ శ్రీ ॥

తలకు మించి ఖర్చు చేయకుము! కడ బట్టలతో దిరుగకుము!!

73 దయగల హృదయమె దైవమందిరము
దయచూపించుచు మెలగుమురా
దయకు దాసుడై దైవమున్నదని
దైవారాధన మరువకురా ॥ శ్రీ ॥

74 అన్నిరకంబుల ప్రేమకు మించి
ఆత్మ ప్రేమ ఒకటున్నదిరా
ఆత్మ పరమాత్మ ప్రేమమయమని
ఆంతర్యమ్ము గ్రహించుమురా ॥ శ్రీ ॥

75 సిరిగలిగిన నాడందరు నీ యొక్క
దరిని జేరి నిను గొలుతురురా
సిరితొలగిన రాబందులగుదురు
పరులటంచుమది నమ్మమురా ॥ శ్రీ ॥

76 ప్రేమను మించిన దైవములేదు
ప్రేమ కొరకు జీవించుమురా
ప్రేమయె ఆటలు పాటలు తలపులు
ప్రేమ మయము ప్రేమించుమురా ॥ శ్రీ ॥

77 అంతశ్శుద్ధి గలిగి దేవ్ని
ఆరాధించుట మంచిదిర
చింతలుడుగు దైవానుగ్రహమున
చిదానందము లభించునురా ॥ శ్రీ ॥

78 ఫలాపేక్ష రహితుడవైయుండి
పరమాత్మను గొనియాడుమురా
ఫలితయులన్ని ప్రసాదించి నీ
పాలిట దేవుడు బ్రోచునురా ॥ శ్రీ ॥

నాస్తిక వాదన చేయకుము! నరుడే నారాయణుడనుము!!

79 మంచి పనులనొనరించువారికి
వంచన లెదురగుచుండునురా
కొంచెపు పనులొనరించువారికి
కొలిచెడి జనులుందురు గదరా

80 ఫలములు గల వృక్షములకెప్పుడు
తలబడి దెబ్బలు తగులునురా
తెలివిగ బ్రతికే వారి కెల్లప్పుడు
గలుగుచుండు [illegible]లురా ॥ శ్రీ ॥

81 భగవంతునిపై భారము వేసిన
భయమెన్నడు నిన్నంటదురా
భగవంతుడె నీ తోడైయుండిన
బ్రతుకు బంగారమగు గదరా ॥ శ్రీ ॥

82 సాధనచే దేహములో దేవుని
సాక్షాత్కారము పొందుమురా
శాంతి సత్త్వగుణ సద్గుణాలతో
సాధించని దేమున్నదిరా ॥ శ్రీ ॥

83 పాలలో వెన్న ఉన్నట్లు నీలో
పరమాత్ముడు దాగెను గదరా
మేలగు నువ్వులలోన నూనెవలె
మేల్కొని దైవంబున్నదిరా ॥ శ్రీ ॥

84 సదా దేవుని సన్నిధానము[illegible]
సాకులు చెప్పి విడనాడకురా
సాధన చేసి దేవుని గనుగొని
శాంతి కాంతిలో [illegible]

85 కల్మష రహితంబైన హృదయమున
కమలాక్షుడు నివసించునురా
కర్త కర్మ క్రియ భోక్త అతడేయని
కలకాలము భావించుమురా ॥ శ్రీ ॥

86 భగవద్భక్తి యనెడి జలముతో
బాహ్య శుద్ధి గావించుమురా
అగణితముగ ధ్యానమనెడి పాత్రతో
అంతశ్శుద్ధి గావించుమురా ॥ శ్రీ ॥

87 అజ్ఞానము నిన్నావహించిన
ఆత్మ తేజమిక నశించురా
ప్రజ్ఞా వంతుడవై నిరంతరము
బ్రహ్మభావమును మరువకురా ॥ శ్రీ ॥

88 నేనంటే మేను కాదు మేనులో
నేను నేననేది తెలియుమురా
నేను తెలిసినను నీవు జ్ఞానివే
మేను నీకు తోడుండునురా ॥ శ్రీ ॥

89 సర్వేశ్వరునకు స్థితప్రజ్ఞుండే
సన్నిహితుండై యుండునురా
సర్వ వేళ దైవమునకత్యంత
సత్కృషి నీవొనరించుమురా ॥ శ్రీ ॥

90 స్వధర్మ మెంతటి నీచమ్మైనను
స్వానుభవమును గ్రహించుమురా
సద్గతి మార్గము స్వధర్మపాలన
సర్వేశ్వరుడే యనుకొనరా ॥ శ్రీ ॥

91 ధనార్జనమే కలభ్యమని
ననక ఓరి చరింగుమురా
పావనమైన జ్ఞానలబ్ధియే
జీవన్ముక్తియే తెలియుమురా ॥ శ్రీ ॥

92 నశ్వర సౌఖ్యముల కాశించితె
భవ బంధములలో పడుదువురా
భావ సౌందర్యముల వాంఛించిన
భగవంతుని వీవగుదువురా ॥ శ్రీ ॥

93 తినుటకొరకె జీవించగలిగిన
మనిషి రాక్షసుండను కొనరా
సుకువుగా బ్రతుకుటకై తినువాడే
ఆత్మ యోగియని తెలియుమురా ॥ శ్రీ ॥

94 ధనసంపాదనకై పనిచేసే
మనిషి అజ్ఞాని యనుకొనరా
జ్ఞాన సంపదకు పాటుపడినచో
జ్ఞాని సుజ్ఞాని యనుకొనరా ॥ శ్రీ ॥

95 ఏనాడి తరుల పెంచనవో
ఈనాటి బాధలుండెనురా
ఈనాడి తరుల సుఖ పెట్టినచో
ఏనాడో సుఖ పడుదువురా ॥ శ్రీ ॥

96 పరులు నీకు నపకారము చేసిన
మరచిపోయి చనుచుండుమురా
పరులకు నీవుపకార మొనర్చిన
ప్రతిఫలమ్ము నాశించకురా ॥ శ్రీ ॥

97 పరులలోన తప్పులువెదకాడెడి
పాడు బుద్ధి నీకెందుకురా
ఇరవుగ నీలో నున్నతప్పులే
సరి చేసుకొనుచు బ్రతుకుమురా ॥ శ్రీ ॥

98 శాంతము శీలము త్యాగగుణాలతో
సదాశివుని కనుచుండుమురా
చాలగ కృషి యొనరించినగాని
బాలముకుందుడు దొరకడురా ॥ శ్రీ ॥

99 వాసన లన్నియు వదలినతోడనె
వైరాగ్యము జనియించునురా
వైరాగ్యమనెడి ఖడ్గముపట్టిన
వానికి మోక్షము సులభమురా ॥ శ్రీ ॥

100 ఎవరికి వారే యమునా తీరని
ఎళ్ళ వేల భావించుమురా
భువిలో మోహమును జయించగలిగితే
బుధ వరుండవై యుందువురా ॥ శ్రీ ॥

101 ఈర్ష్యాసూయలె అశాంతినిలయము
ఇబ్బందులు కలిగించునురా
ఆర్ష్య విజ్ఞానమార్జించినచో
ఆత్మబోధ గోచరమగుర ॥ శ్రీ ।

102 అలలు తప్పవు సముద్రమందున
ఆలోచన గావించుమురా
ఇలలో సుఖ దుఃఖములు తప్పవు
కలసి మెలసి జీవించుమురా ॥ శ్రీ ॥

103 ఘో'రమైన సంసారమున బడి
గోవిందుని ఎ.. మరవకురా
పారమార్థికమె శ్రేష్ఠమైనది
పరమాత్మను ప్రణమిల్లుమురా ॥ శ్రీ ॥

104 ధనకనక వస్తు వాహనంబులకు
దాసుడవై జీవించకురా
మనకు శాశ్వతుండగు భగవంతుడె
మహాభాగ్యమని కోరుమురా ॥ శ్రీ ॥

105 ఆలుబిడ్డలకు పరితపించిన
అధోగతి పొందుదువురా
ఆత్మ కొరకు జీవితమర్పించిన
అనంతసుఖములు అలవడురా ॥ శ్రీ ॥

106 మూడు నాళ్ళ ముచ్చట జీవితము
ముక్తి కొరకు తపియింపుమురా
తోడుగ భగవద్ధ్యాన మార్గమున
వీడక చరించు చుండుమురా ॥ శ్రీ ॥

107 వచ్చేటప్పుడే దియుదెబ్బతిని
వదలునపుడు వెతలెందుకురా
ముచ్చికతో నీ జన్మకు కారణ
మహత్వమేమో కనుగొనరా ॥ శ్రీ ॥

108 నీవెవండవొ తెలిసి కొనుటకై
నీకీ జన్మము వచ్చెనురా
పావనమైనది పరమపదమునే
ప్రార్థన చేయుచు బ్రతుకుమురా ॥ శ్రీ ॥

109 క్షణిక సుఖము కాశించి జీవితము
చెరసాలలో బడనీయకురా
కని విని యెరుగని పరమపదముతో
కాంక్ష గలిగి జీవించుమురా ॥ శ్రీ ।

110 అందరు పెడితే తినియెడివాడే
ఆపదలకు నెవరుండరురా
బాంధవుడగు భగవంతుని వేడి
బాధ విముక్తి చెందుమురా ॥ శ్రీ ।

111 సముద్ర మందున ఓడనుచూచి
సంసారమ్మును నడుపుమురా
సదా భక్తియను ఓడలనిలిచి
సాగి దరి గనుచుండుమురా ॥ శ్రీ ॥

112 బాధ్యతలున్నవి అనుకోవడమే
బంధములో బడుచుందువురా
బాధ్యతలను దేవునిపై వేసిన
భాగ్యవంతుడగు చుందువురా ॥ శ్రీ ॥

113 చితిచచ్చిన మనిషిని దహించును
మతి ఆలోచన సేయుమురా
చింతయు బ్రతికిన మనిషిని చంపును
చిదానందమున నడుపుమురా ॥ శ్రీ ॥

114 మానవ శరీర మెముకలు మాంసము
మల మూత్రాదుల కొంపయురా
పూని అశాశ్వతమైన తనువుపై
లేని పోని భ్రమలెందుకురా ॥ శ్రీ ॥

అతి ప్రాణం ఏము కొ పట్టేకు। ఎంత భాగ్యమును విడచిపోకు॥

115 పాంచ భౌతికంబైన దేహమిది
పంచ భూతముల కలియునురా
ఎంచి చూడ వ్యామోహము వదలి
ఏలెడి దేవుని వెదకుమురా ॥ శ్రీ ॥

116 ధనవంతుడైన ఆశ గలిగిన
దరిద్రుడని భావించుమురా
దరిద్రుడైనను తృప్తి గలిగిన
ధనవంతుండని ఎంచుమురా ॥ శ్రీ ॥

117 సోమరితనమె చీడ పురుగుతో
సమానమైనది తెలియుమురా
సోహమనే తత్త్వముతో నడిచిన
సోమ శేఖరుడవౌదువురా ॥ శ్రీ ॥

118 అహంకారమే ఆనందానికి
అడ్డుగోడయని తెలియుమురా
అహంకారమును విసర్జించితే
ఆత్మ దర్శనము కలుగునురా ॥ శ్రీ ॥

119 ఆత్మీయతతో ఎదుగాలంటే
అన్యాయంబెదురించుమురా
కీర్తి ప్రతిష్ఠలు కలగాలంటె
కీడు నెంచక చరించుమురా ॥ శ్రీ ॥

120 సర్వవేళ రక్షణ కలిగించే
శాంతి ఆయుధంబొకటేరా
మర్యాద గలిగి దుర్గుణాలను
మానుటకై యత్నించుమురా ॥ శ్రీ ॥

21 శరీరమందు పటుత్వము తగ్గిన
స్త్రీ వ్యామోహించెందుకురా
శవమై పోవుట దగ్గరున్నది
శివుని స్మరించుచు నుండుమురా ॥ శ్రీ ॥

22 సుఖ శాంతులు నీ ముందు నున్నవని
తికమకపడి తిరుగాడకురా
సకలము నీలో దాగి యున్నది
సాధన చేసి గ్రహించుమురా ॥ శ్రీ ॥

'3 వినయము లేనటువంటి విద్యలు
విహీన మృతికుల ఎంచుమురా
అనుభవము లేని పాండిత్యమ్ము
అగౌరవంబును దెచ్చునురా ॥ శ్రీ ॥

'4 కోరికలన్ని తీరాలంటే
కోరకుండుటయే మంచిదిరా
కోరుకున్నదో ప్రశాంతి దొరుకును
కోట్ల సుఖాలోన గూడునురా ॥ శ్రీ ॥

'5 నిస్సంకల్పము నిర్గుణత్వము
నిత్యానందము గలుగునురా
ఈశుని గొలుచుచున్నయెడలనీ
ఇహపరసుఖముల నిచ్చునురా ॥ శ్రీ ॥

6 అధికాదాయము పెరిగిన కొలది
అలజడులేర్పడు చుండునురా
మదికానందము కావాలంటే
అదుపుతోడ చరియించుమురా ॥ శ్రీ ॥

127 కామము వదలక రాముని దలచిన
కలుగదు సౌఖ్యము తెలియుమురా
ఈ మహి బూడిద పన్నీరువోలె
ఇహపరముల చెడుచుందువురా ॥ శ్రీ ॥

128 ఆచరణంబులు అనుష్ఠానములు
ఆత్మ దర్శనంబొసగునురా
ఆచరణము లేనట్టి ప్రచారము
అవమానంబొనరించునురా ॥ శ్రీ ॥

~9 అనుమానము పెనుభూతమ్మైనది
మనో నిగ్రహమెనర్చుమురా
తనువస్థిరమ్మైనది భగవంతుని
తత్త్వము కనుగొనుచుండుమురా ॥ శ్రీ ॥

130 సంశయాత్మకు శాంతి లభించదు
సాధనాదులను విడువకురా
సాధన చేసి సంశయముడిగిన
సర్వేశ్వరుడే కనబడురా ॥ శ్రీ ॥

131 భక్తి లేని ఏ కార్యము చేసిన
బాధలు ఎదురగుచుండునురా
భాండ శుద్ధి లేనట్టి పాకము
బహు వికారములు గలుగునురా ॥ శ్రీ ॥

132 అతి మూర్ఖత్వంబనర్థాలకు
ఆది మూలమ్మై యున్నదిరా
క్షితిలో ముక్తి లభించాలంటే
మతి చలియించక యుండుమురా ॥ శ్రీ ॥

133 మంచి చెడుల సమ్మేళనయనుచు
మానవ జన్మ గ్రహించుమురా
ఎంచి చూడ సంఘర్షణమనియో
చించి నడిచిన ధన్యమురా ॥ శ్రీ ॥

134 నిదానమనునది జీవన జ్యోతికి
ప్రధానమైనది తెలియుమురా
వ్యథలను దిద్దెడి ఈశుని నమ్మక
వృథా బ్రతుకు నీకెందుకురా ॥ శ్రీ ॥

135 మాతృభావమున మగువలజూచిన
మహా మనిషి వీవగుదువురా
మానసమున కామముతో జూచిన
మహా పాపములు గలుగునురా ॥ శ్రీ ॥

136 చింతలన్నిటిని వదలి సద్గురుని
చెంత జేరి ధ్యానించుమురా
ఎంతో సుఖమయమైన ఆత్మన్
అంతరంగమున కనుగొనరా ॥ శ్రీ ॥

137 ఏకాగ్రత సాధించగలిగితే
నీకసాధ్యమేమున్నదిరా
ఏకాగ్రత వెయ్యేనుగుల బలమై
నీకు మేలు గలిగించునురా ॥ శ్రీ ॥

138 సృష్టిని మార్చుటకై యత్నించకు
దృష్టి మార్చుకొనుచుండుమురా
సృష్టి దృష్టితో ముడిపడియున్నది
సృష్టి కర్తనే కనుగొనరా ॥ శ్రీ ॥

139 వాదన భావము మనసున నిలిపి
బాధపడే బ్రతుకెందుకురా
భేదములన్నియు తొలగజేయునది
వేద విద్యలను తెలియుమురా ॥ శ్రీ ॥

140 సర్వజనులను సమముగ జూచిన
శాస్త్ర జ్ఞానమనబడుగదరా
సర్వవేళల శాస్త్ర జ్ఞానమున
సాగుచుండి కడ తేరుమురా ॥ శ్రీ ॥

141 బ్రాహ్మణుండవై యుండాలంటె
భ్రమలు విడిచి జీవించుమురా
బ్రాహ్మణుడే జగమంత బ్రహ్మమని
భావనగలిగి చరించుమురా ॥ శ్రీ ॥

142 సర్వజనాళికి సమానమైనది
శాస్త్రబోధలని తెలియుమురా
గర్వంబనియెడి గుణముతొలగితే
సర్వేశుడు నిను బ్రోచునురా ॥ శ్రీ ॥

143 బురదలోన పాదాలు దిగబడిన
బుద్ధిచపల మొనరించకురా
ఇరవుగ శిరమును ఆకాశమున
స్థిరబుద్ధితోడ నిలుపుమురా ॥ శ్రీ ॥

144 శిష్యునివలె [illegible]
చిత్తములో స్థిరపరుచుమురా
సవినయముగ ఆనందామృతమును
సమాజానికి నొసగుమురా ॥ శ్రీ ॥

145 దేవాలయమున దేవుని కొరకై
దేదీప్యముతో దిరుగుమురా ।
పావన మౌ పసిపాపల నవ్వుల
పరంధాముడుండెనుగదరా ॥ శ్రీ ॥

146 బాధలలో కన్నీటి బొట్లలో
భగవానుండిమిడున్నడురా
హృదయము లోపల నవ్వుచునున్న
మధుసూదనుని కనుగొనరా ॥ శ్రీ ॥

147 కొండ కోనలల దేవుడున్నడని
మెండుగ దిరుగుచు చెడకుమురా
గుండె లోపల నిండుగ దాగెను
గుర్తు పట్టుకొని నడువుమురా ॥ శ్రీ ॥

148 జీవితమనియెడి "సర్కసు"లోన
జంతువులుండి చరించునురా
కావరమున నీమనసు కోతియై
త్రోవ చెడ గొట్టు చున్నదిరా ॥ శ్రీ ॥

149 ప్రపంచ గీతాన్నాలాపించి
పరమాత్మస్తుతిగ పాడుమురా
విపంచి మాధుర్యమున గ్రహించి
విభుడనె దేవుని గూడుమురా ॥ శ్రీ ॥

150 హృదయములోని తుఫానులు రేగిన
మది వివేకమును ముంచునురా
సదమలముగ నీ మనసేకాగ్రత
సలుపుచు సాధన చేయుమురా ॥ శ్రీ ॥

151 అనేక శాస్త్రాల్ చదువుచు మూర్ఖుడు
పెనవేసుక వల్లించునురా
అనుష్ఠించడము వివేకవంతున
కధికారంబున్నది గనరా ॥ శ్రీ ॥

152 అంతరంగమున శాంతి లభించిన
చింతలెప్పుడు నిన్నంటవురా
మంతనంబున ప్రశాంతతగలిగిన
మానవ జన్మము ధన్యమురా ॥ శ్రీ ॥

153 పుష్పములాంటిది వేదాంతమ్ము
పూర్ణముగా గమనించుమురా
విశ్వాసముతో తుమ్మెదవై
విడువక గ్రహించు చుండుమురా ॥ శ్రీ ॥

154 దుఃఖాల కలిన చీకటి లోపల
దేవుని దయకై వేడుమురా
సుఖాల వెల్లులలో చరించుటకు
సోమ శేఖరుని గొలువుమురా ॥ శ్రీ ॥

155 గుండె లోపల నిండిన దేవుని
గుడుల మాత్రమున్నాడని తెలియుమురా
అందంగ వెలిగిన ఆ పరమాత్ముని
ఆట పాటలతో చూడుమురా ॥ శ్రీ ॥

156 ముసలి తనమున్ తలపై బూసిన
ముగువల భ్రాంతిని విడువవురా
విసపు గుండెలో యౌవన జ్వాలల
మసి పూసుక చరియించకురా ॥ శ్రీ ॥

157 వింతగ నీదు వయస్సు క్రమముగ
ఎంతో తరుగుచునున్నదిరా
చింతన వల్ల వివేకము కలిగిన
చిక్కులన్ని విడిపోవునురా ॥ శ్రీ ॥

158 పేద మానవుడు వాదన చేయక
సీదా సాదగ బ్రతుకునురా
సాధకుడున్నత భావంబులతో
మోదముతో జీవించునురా ॥ శ్రీ ॥

159 తల మీద జుట్టు గలిగి యున్నచో
ఇలలో అందెన్నిచ్చునురా
తలలోని జ్ఞానముదయించినచో
తనకు గొప్పతన మెసగునురా ॥ శ్రీ ॥

160 అల్పునికైనను అధమునికైనను
ఆత్మజ్ఞానము కావలెర
తలపుల బ్రహ్మ జ్ఞానమున్నచో
మలుపు తిరిగి సుఖ పడుదువురా ॥ శ్రీ ॥

161 అమాంతముగ కష్టాలెదురైనను
హిమాలయముగ నిలబడురా
అమాయకుల కష్టాలకు నీవొక
ఆత్మ బంధువై యుండుమురా ॥ శ్రీ ॥

162 అక్షరాలమయమైనది జగత్తు
అభ్యాసము గావించుమురా
అక్షరరూపుని వెదకి పట్టుటకు
తక్షణమే కృషి సల్పుమురా ॥ శ్రీ ॥

163 తల్లి గర్భమున వచ్చిన దేహము
తరలి స్మశానము చేరునురా
మెల్లగ వెనకకు తిరిగిన మనస్సు
వెల్లి మూలము గ్రహించునురా ॥ శ్రీ ॥

164 ప్రాణజ్యోతి ఎప్పుడో ఒకరోజు
పడిపోయి ఆరి పోవునురా
జ్ఞాన జ్యోతితో స్వేచ్ఛ విహారము
గలిగి పరమ సుఖ మందుమురా ॥ శ్రీ ॥

165 నీతి దప్పి నీ చేతిని చాపుట
పాతకమని భావించుమురా
దాతవయ్యి నీ చేతిని సతతము
ధరపై నిలుపుట మంచిదిరా ॥ శ్రీ ॥

166 మనస్సు మౌనము వహించినప్పుడే
మాధవు పలుకులు వినబడురా
జ్ఞాన దీపికతో కర్మ మార్గమును
పూని నడచుచు మెలంగుమురా ॥ శ్రీ ॥

167 ఆస్తిపాస్తి భౌతిక సంపదలు
ఆయాసాలొనరించునురా
ఆధ్యాత్మిక సంపద కూర్చుంటే
అనుభవించుచు తరించుమురా ॥ శ్రీ ॥

168 పెద్ద పెద్ద కార్యములొనరించి
పేరు కీర్తి నాశించకురా
శుద్ధమైన పరమాత్మను కనుగొని
బుద్ధుడవై జీవించుమురా ॥ శ్రీ ॥

169 బండి చక్రాల సమానమైనది
బాల్యజీవితం బనుకొనరా
దండిగ కష్టసుఖాల్ రెండింటిని
నిండు మనసుతో సహించరా ॥ శ్రీ ॥

170 మహావీరుడు కబీరు నానకు
మహానుభావుల తెలియుమురా
ఇహమునందు పరమాత్ముని మదిలో
ఎల్లవేళ ధ్యానించుమురా ॥ శ్రీ ॥

171 క్షణకాలమైన శివజీ వైక్యము
చేసు కొనుచునుసుఖించుమురా
అనువుగ పరమాత్మనునిరంతరము
పెన వేసుక జీవించుమురా ॥ శ్రీ ॥

172 భాగ్యవిదాతవు నీవేయనుచు
భావన కలిగి చలించుమురా
భగవద్భిన మహాత్మ్యము కలిగి
బ్రహ్మానందము పొందుమురా ॥ శ్రీ ॥

173 మేలుకొలుపుము నీలో శక్తిని
మోక్షమునకు మళ్ళించుమురా
కాలుడు నీదరి చేరకుండుటకు
గట్టి ప్రయత్నము చేయుమురా ॥ శ్రీ ॥

174 శివరూపమే చైతన్యవంతమై
చిత్తములో ఇమిడున్నదిరా
భవబంధములకు భయపడకెన్నడు
భావ శుద్ధితో నడువుమురా ॥ శ్రీ ॥

175 వేయిసార్లు అపజయమెదురైనను
వీడక కృషి నొనరించుమురా
పాయక పరమేశ్వరుని ఆజ్ఞతో
పట్టుబట్టి గెలుపొందుమురా ॥ శ్రీ ॥

176 అలలు సముద్రములో గంతులతో
అగుపడుచున్నవి తెలియుమురా
ఆ విధమున నీచిత్తముచేతన
మగుచున్నది భావించుమురా ॥ శ్రీ ॥

177 ఆత్మ సాగరమునందున జేరి
అనంత క్రీడలొనర్చుమురా
అనంతుడే నీ ఆత్మరూపమై
అమరత్వము చూపించునురా ॥ శ్రీ ॥

178 తుచ్ఛమైన ఆకర్షణలకునీ
విచ్ఛ కలిగి చెడి పోకుమురా
స్వచ్ఛమైన సత్పురుషులసేవలు
సల్పిన సుఖము లభించునురా ॥ శ్రీ ॥

179 ఏకాంతమనగ ఏమనుకొనెదవ్వు?
నీ కర్థముగాదిక వినరా
ఏ సంకల్పము లేని చోటనే
ఏకాంతము దాగున్నదిరా ॥ శ్రీ ॥

180 మౌనముగా నుండిన వారందరు
మౌనులటంచు తలంచకురా
మననము నిరతము సల్పుచుండిన
మనిషియె ముని వరుడనుకొనరా ॥ శ్రీ ॥

181 అవిశ్వాసమున చరించుచుండిన
అధోగతి పాలగుదువురా
ఆత్మయందు విశ్వాసమున్నచో
అమృతసిద్ధి లభించునురా ॥ శ్రీ ॥

182 సోమరితనమున బ్రతుకుచున్నచో
పామరుండవై చెడుదువురా
సోఽహం పరతత్వములో నడచిన
అహం బ్రహ్మవై యుందువురా ॥ శ్రీ ॥

183 శిలను శిల్పినిగా చేసిన గురువును
దలచుచు ధ్యాన మొనర్చుమురా
తలపై సహస్ర స్థానము తోనై
నిలచిన వానిని కనుగొనరా ॥ శ్రీ ॥

184 స్వతంత్రుండవై యున్నావనుచు
వితండ వాదన చేయకురా
మతి వికసించి వివేకము కలిగి
మాన్యుడవై చరియించుమురా ॥ శ్రీ ॥

185 మనస్సు నీ యెడవశమ్మై యుండిన
మహాదేవుడవు నీవేరా
మనసుకు నీవే వశమ్మై పోయిన
మందమతుడవై పోదువురా ॥ శ్రీ ॥

186 ఆధ్యాత్మిక జీవన మారోగ్యము
అలవడునని భావించుమురా
అహంకారమే అనారోగ్యమని
ఆలోచనతో నడువుమురా ॥ శ్రీ ॥

187 కామములోబడి కాలునిసన్నిధి
కదిలి పోవుటయు ఎందుకురా
రాముని కంటె నామమె గొప్పది
రాత్రింబవళ్లు జపించరా ॥ శ్రీ ॥

188 వినయ విధేయతలుండి చరించుచు
విద్యలు పూర్తిగ నేర్వుమురా
అనువుగ వాసన గల పుష్పము వలె
మనిషి బ్రతుకు ధన్యంబగురా ॥ శ్రీ ॥

189 రెండు పెదవులను నిండుగ మూసి
మెండుగ ధ్యానమొనర్చుమురా
గుండెలోన దాగిన భగవానుని
గుర్తుతెచ్చుకొనుచుండుమురా ॥ శ్రీ ॥

190 ఇచ్చిన దానము వచ్చిన బిరుదులు
మెచ్చక తోడుత మరువుమురా
తుచ్ఛమైన గౌరవమర్యాదల
నిచ్ఛ కలిగి జీవించకురా ॥ శ్రీ ॥

191 అనిత్యమైనటు వంటి సుఖాలకు
అలమటించడము ఎందుకురా
ఆత్మసుఖంబే శాశ్వతమనుకొని
అభ్యాసాలను మరువకురా ॥ శ్రీ ॥

192 నవవిధ భక్తుల నాలోచించి
నచ్చిన మార్గము నడువుమురా
భువిలో భక్తియె తరించు మార్గము
బుద్ధి గలిగి చరియించుమురా ॥ శ్రీ ॥

**ప్రేమయే దైవము! భావశుద్ధియే జ్ఞానము!!**

193 భ్రాంతిని నిర్మూలము గావించెడి
బ్రహ్మ విద్యయే తెలియుమురా
భ్రాంతియె జన్మకు కారణమైనది
భవ బంధములలో చిక్కకురా ॥ శ్రీ ॥

194 తత్త్వవేత్తలౌ జ్ఞానుల జేరిన
తరించు మార్గము దొరుకునురా
చిత్తరి మనసును బంధించుచునిక
చిత్తశుద్ధితో బ్రతుకుమురా ॥ శ్రీ ॥

195 సద్గురు కరుణను సంపాదించిన
సాత్త్విక గుణముదయించునురా
సతతము వైరాగ్యైశ్వర్యములతో
సాయుజ్యము లభియించునురా ॥ శ్రీ ॥

196 కోరికలన్నియు జీవితమ్మలో
కొలువు జేరి యున్నవి గనరా
కోరికలుడిగిన సుఖములు వశమై
కూర్మిని పెంపొందించునురా ॥ శ్రీ ॥

197 అగ్నికి కాలని వస్తువేమిటో
ఆలోచించిన దొరుకునురా
అదియె అచలము అదియె అమరము
ఆధారము నీకైనదిరా ॥ శ్రీ ॥

198 కామక్రోధమదమత్సరములతో
కాయమున్నదని తెలియుమురా
నేమముతో భగవద్ధ్యానములో
ప్రేమ కలిగి జీవించుమురా ॥ శ్రీ ॥

199 గురుపదముపై మనసునిలిపిన
క్రూర గుణము లెడ బాయునురా
పర[illegible]గమనెక్కి సామ్రాజ్యముకై
[illegible]ఏక [illegible] నలించుమురా ॥ శ్రీ ॥

200 ఆత్మ గర్భ[illegible] శాస్త్రమైనదని
ఆమ్నాయశాస్త్ర [illegible]గుంగుమురా
ఆత్మయె సర్వము నిండి యున్నదని
అది తెలిసి కొనుచు నడువుమురా ॥ శ్రీ ॥

201 ఆత్మహత్యతో సమానమైనది
ఆత్మస్తుతి నీకెందుకుర
ఆత్మ పరమాత్మ యొకటేయనుకో
అతిమూర్ఖత్వము వదలుమురా ॥ శ్రీ ॥

202 పాడు భూమి సమమైనది దేహము
ఫలితమీయదని తెలియుమురా
పలితాలొసగెడివాసుదేవుని
ప్రార్థనాదులను మరువకురా ॥ శ్రీ ॥

203 ఆకాశాన దిరిగె విమానము
కాధారము భువియైనదిరా
ఆవిధి నీమది బ్రహ్మాంకితము
అగునట్లుల చరియించుమురా ॥ శ్రీ ॥

204 ఇంటిలోన వెలుగీయని దీపము
మింటి కెగసి ఏమున్న దిరా
కంటిలోన వెలిగెడు కాంతులను
గాంచని బ్రతుకింకెందుకురా ॥ శ్రీ ॥

205 ఇంద్రియాలలో ఇక్కిన మనసు
ఇబ్బందులు పడుచున్నదిరా
ఇహమున సద్గుణ సంపదలున్నను
ఈశ్వరుడే కరుణించునురా ॥ శ్రీ ॥

206 పంటకు నీరందియని వాగు
పరుగులు నురుగులు ఎందుకురా
వెంటనున్న భగవానునిదెలిసి
వేడని జన్మంబెందుకురా ॥ శ్రీ ॥

207 బంగళాలు బంగారమున్నను
బొంగులె చివరకు దిక్కగురా
రంగు మీర నీ ఆత్మారాముని
రాత్రింబంగళ్ళు మరువకురా ॥ శ్రీ ॥

208 మనసొక్కటై అనేక విధముల
మార్గాల మసలు చున్నదిరా
మనసుకు గమ్యపు మార్గముదెలిపి
మహాత్మునిగ జీవించుమురా ॥ శ్రీ ॥

209 నీరుపాలలో జేరిన వెంటనే
తీరు మార్చుకొనుచుండునురా
ఆ రీతిగ బ్రహ్మైక్యము పొందెడి
అలవాటు నభ్యసించుమురా ॥ శ్రీ ॥

210 తిరిగిరాని నీ స్థితి బోధించెడి
గురు మూర్తిని దర్శించుమురా
మరుగు దెలుసుకొని మనసు నిలుపుకొని
మహా మనీషివై బ్రతుకుమురా ॥ శ్రీ ॥

211 నది సాగరమున ప్రవేశించిన
నామరూపంబులుండవురా
విధి విధానమున బ్రహ్మోపాసన
మదిలో చేసి తరించుమురా ॥ శ్రీ ॥

212 జీవిత గమ్యము మోక్షమనుకొని
నీవిక నాలోచించుమురా
జీవితాంతము సమదృష్టి గలిగి
జీవించుటయే మోక్షమురా ॥ శ్రీ ॥

213 కళ్ళెము లేని గుఱ్ఱము మాదిరి
కలిగి మానసము తిరుగునురా
ఎల్లవేళలో గురుకృప యనెడి
కళ్ళెము బట్టి చరించుమురా ॥ శ్రీ ॥

214 మూడవస్థలను గూడి జీవుడు
మూర్ఖుడయ్యి చెడుచుండెనురా
తోడుగ తూర్యాతీతము దెలిసి
వేడుకతో జీవించుమురా ॥ శ్రీ ॥

215 కొంగలు హంసలు ఒకే రూపమై
నింగిలోన కనిపించునురా
దొంగ గురువులను నమ్మకున్నచో
భంగపడుచు దు ఖింతువురా ॥ శ్రీ ॥

216 భోగ సంపదల మెరపులన్నిక్షణ
భంగురమని భావించుమురా
సాగిసాగి బ్రతుకే నీ ఆయువు
చంచలమైనది తెలియుమురా ॥ శ్రీ ॥

217 సంసారంబను సంద్రము ప్రక్కన
సదాశివుని వొద్దున్నదిరా
సద్గురు సాధన తెడ్డును చేకొని
సముద్రము దాటుచుండుమురా || శ్రీ ||

218 సర్వతీర్థమయమైనది గీతా
సారంబెరిగి మెలంగుమురా
సర్వత్రే జముదయించు నీలోతిరి
సాక్షాత్కరించు చుండునురా || శ్రీ ||

219 గోడకు వేసిన సున్నము మాదిరి
వీడక గురువుతో నుండుమురా
వేడుకతో పరమాత్మసన్నిధి
గూడెడి మార్గము చూపునురా || శ్రీ ||

220 దేవుని పలికరమీశరీరమని
దెలసిధర్మమున నడువుమురా
దేనినైన నీ వాశించక భువి
దేవుని గూర్చితపించుమురా || శ్రీ

221 శాస్త్రవిధుల నుల్లంఘించినచో
సర్వ దుఃఖములు గలుగునురా
సమాజమునకుమేలొనరించుటకే
శాస్త్రములున్నవి తెలియుమురా || శ్రీ ||

222 సత్యమతము స్థాపనగావించిన
శాంతి పథము వెలుగొందునురా
శాంతము సత్యము భగవంతుండై
సదాసుఖములందించును రా || శ్రీ ||

223 కరుణా మతమును వృద్ధిచేసిన
కరువు కాటకాలుండవురా
ఇరస్సు జ్ఞానమతమువ్యాపించిన
ధరణి వర్ధిల్లు చుండునురా ॥ శ్రీ ॥

224 ద్వైతమతంబు ప్రతిష్ఠన నర్చిన
ధరణికి శాంతిలభించునుర
ధర్మమతమునీవృద్ధిలించిన
ధాత్రి స్వర్గముగు చుండునురా ॥ శ్రీ ॥

225 సమస్త ప్రాణుల యందు చలించెడి
సముదాయమ్ము గ్రహింపుమురా
సదసంచని పరబ్రహ్మ సం
స్మరణాదుల విడనాడకుర ॥ శ్రీ ॥

226 వాదభేదరహితుడవై నిత్యము
యథార్థమును గమనించుమురా
సదార్థమే గురుసహాస్రారమని
పట్టు విడక ధ్యానించుమురా ॥ శ్రీ ॥

227 నిరంజనుండైనట్టి సద్గురుని
నీవరాధన చేయుమురా
పరబ్రహ్మమును పొందగోరెడి
ప్రయత్నాలతో నుండుమురా ॥ శ్రీ ॥

228 చింతచికాకులు విడిచి నడచిన
...లో మేలు జనించునురా
...సంగరూపుడైన సద్గురు
...పాదములకు మొక్కుమురా ॥ శ్రీ ॥

229 అమృత మెక్కడనోలభించునని
ఆరాటముతో దిరుగకురా
ఆత్మశాంతి క్షమ దయాగుణములే
అమృతమని భావించుమురా ॥ శ్రీ ॥

230 ప్రణవ మంత్రమను ఓంకారంబును
పట్టుబట్టి జపియించుమురా
అనువుగ చిత్తము మరల్చినచో నీ
అఘములు నశించి పోవునురా ॥ శ్రీ ॥

231 ప్రయత్నమనియెడి నాగలి బట్టి
పొలము దున్నుకొనుచుండుమురా
ప్రార్థనతోడుత కలుపుతీసిన
పంట పుష్కలము పండునురా ॥ శ్రీ ॥

232 నిత్యానందంబనెడి పంటకు
నిరంతరముకృషి చేయుమురా
విత్తనంబులను నాటి భక్తితో
వివేక వర్షమొసంగుమురా ॥ శ్రీ ॥

233 పరీక్ష కాలము వచ్చుచున్నది
పాపంబులనొనరించకురా
పవిత్ర భావముతో చరించిన
పరమేశుడు కనుపించునురా ॥ శ్రీ ॥

34 ఎవరికి వారే యమునాతీరే
ఎల్లవేళ భావించుమురా
ఎవరికివారే దైవమార్గమును
వెదకులాడుకొనవలయునురా ॥ శ్రీ ॥

235 అగ్ని లేనిదే కంటలు ఎండుట
అసాధ్యమని భావించుమురా
అటులే జ్ఞానములేని మోక్షము
అందదనుచు గుర్తెరుగుమురా ॥ శ్రీ ॥

236 అజ్ఞానముతో అలుముకున్నదే
అదియే బంధనమనుకొనరా
విజ్ఞానముతో విడిచి వేయుటే
విముక్తి మార్గంబైనదిరా ॥ శ్రీ ॥

237 చీకటి నిర్మూలము చేయుటకై
చిరు దీపము కావలయునురా
ప్రాకటముగ మాయను జయించుటకు
పవిత్ర జ్ఞానము బడయుమురా ॥ శ్రీ ॥

238 అంతా మిథ్యయటంచుదలంచిన
చింతలునీదరి జేరవురా
ఆధ్యాత్మిక శిఖరాల కెదిగి నీ
వఖండ జ్యోతిని కనుగొనరా ॥ శ్రీ ॥

239 నీటిన బుట్టిన బుడుగ మాదిరి
నీ శరీరమిటు వచ్చెనురా
కాటిలోనబడి కాలిపోవును
ఏటికీ వ్యామోహంబులురా ॥ శ్రీ ॥

240 ముద్దుగ కనబడు ఆభరణాలకు
మూలము బంగారము గదరా
ముల్లోకాలకు బ్రహ్మమొక్కటే
మూలపదార్థంబనుకొనరా ॥ శ్రీ ॥

241 బియ్యమునుండి నూకను వేరుగ
చెయ్యవచ్చునని తెలియుమురా
చయ్యన దుర్గుణముల నెడబాసిన
సాయుజ్యమ్ము వరించునురా ॥ శ్రీ ॥

242 వేదాలనుండె మహావాక్యములు
వెలుబడెనని మదిదెలియుమురా
బోధలమర్మము దెలిసి జీవాత్మ
భేద భావముల వదలుమురా ॥ శ్రీ ॥

243 నిర్మలమైనటువంటి బ్రహ్మమును
నేనేయనుచు చరించుమురా
కర్మ బంధములు నశించిపోవును
కడకు ముక్తి పదమందునురా ॥ శ్రీ ॥

244 ఔషధములు సేవించినవానికి
అనారోగ్యంబులుండవురా
ఔపాసన ధ్యానాదులానర్చిన
అవిద్య రోగాల్ నశించురా ॥ శ్రీ ॥

245 ఆత్మ జ్ఞాని నిష్ఠాపరుండు పర
మానందముతో నుండునురా
యావత్తు దృశ్య ప్రపంచమంతయు
ఆత్మయందు లయ మగుగదరా ॥ శ్రీ ॥

246 స్వస్వరూప సంధానమె ముక్తి
స్వరూపమని గుర్తెరుగుమురా
సాక్షాత్కారంబైన పరమాత్మ
సందులేక ఇమిడున్నదిరా ॥ శ్రీ ॥

డాంబికమే మోహము శాంతమే సౌభాగ్యము॥

247 నిజము తెలియ లేనంత కాలము
నీవు భ్రమకులోనౌదువురా
అంతరి రూపు కనుగొన్న క్షణములో
అంధత్వమ్ము నశించునురా ॥ శ్రీ ॥

248 రాగద్వేషాది రాక్షసులనెడి
రోగములను మర్ధించుమురా
యోగివై సదా యుండెడి ఆత్మను
యోగముతో గుర్తెరుగుమురా ॥ శ్రీ ॥

249 యధార్థానికి బ్రహ్మను మించిన
పధార్థమే లేదనుకొనరా
సదా బ్రహ్మ సంధానుడవైన
అదేనీవయి తలింతువురా ॥ శ్రీ ॥

250 జీవుడు దేవుండైనాడనుచు
భావించిన చెడిపోదువురా
పావన ధ్యానములో మునింగితే
దేవుడు జీవుండౌకడేరా ॥ శ్రీ ॥

251 బాధయనియెడి జీవితమునకాక
భాగమైనదని తెలియుమురా
మోదముతో జీవితము బాధలని
భేదమెందక చరించుమురా ॥ శ్రీ ॥

252 మురారి చూపిన ముక్తి మార్గము
ఐరాన గనుగొని తరించరా
పరమేశ్వరుని అనుగ్రహముచే
పరమ పదములభియించునురా ॥ శ్రీ ॥

ఓం శాంతి

హాస మె తేజస్సు సహిం ౹నదే శాంతము



# ఓం శివభక్త మార్కండేయాయనమః

**1**
మార్కండేయుని దివ్యచరితము
మనసారగవిని తరించుడీ
మరణబయంబులు తొలుగజేసిడి
మౌనికులోత్తమ చరితమిది ॥మా॥

**2**
మున్నుకృతాయుగమందు మృకండుం
డను పుణ్యపురుషుడుండెన్
అనువుగ మరుద్వతిని పెండ్లి సియు
ఆనందముతో నుండెన్ ॥మా॥

**3**
గృహస్థ దర్మంబుల పాటించుచు
నిహములో పేరు బడసెన్
అహర్నిశలు గిరిజామనోహరుని
ఆరాదించుచునుండెన్ ॥మా॥

**4**
అతిధుల నభ్యాగతుల మన్ననలు
అందిరి ఆదంపతులు
అతివినయ శీల ముల పాటించుచు
ఆదర్శవంతులైరి ॥మా॥

**5**
దండి బాగ్యములు గలిగియుండినను
తపించిరి సంతులేకన్
నిండు మనంబున శంబుని గొలుచుచు
నుండిరి బేదము తోడన్ ॥మా॥

**6**
మునిగణంబులొకనాడు బ్రహ్మాదే
వుని దర్శనార్థమునకున్
జనవలెనని యోచించి మృకండు
మునికెరి గించగ వినగన్ ॥మా॥

7 మీతోనేవచ్చెదనని ప్రీతిగ
మృకండు మహర్షి పలికెన్
సంతోషముతో రమ్మని దెలుపగ
సత్యలోకమున కరిగెన్ ॥మా॥

8 సత్యలోక ద్వారంబున నిలబడి
నన్నుతిచే సెను బ్రహ్మన్
సత్వరమె ద్వారపాలుడు గనుగొని
సంతానము తానడిగెన్ ॥మా॥

9 సంతానము లేదని మృకండుముని
చింతించుచుతా పలికెన్
అంతటద్వారపాలుడెదుర్కొని
ఎంతో కోపము చెందెన్ ॥మా॥

10 ఎంతవాడైన సంతులేకున్న
ప్రవేశించరాదు ఇటకున్
మరలిపొమ్ము నిలువక వేగిరమున
మహా పాతకుడ వనియెన్ ॥మా॥

11 చింతాక్రాంతుండగు మృకండునికి
చిరుచెమటలు మదినిండన్
మంతనమున దు ఖించుచు ఇంటి
మార్గమునకు జనుదేరెన్ ॥మా॥

12 అంతలోనతన యింటికి పతివ్రత
అనసూయదేవి వచ్చెన్
అది చూచిన ఆమరుధ్వతీపతి
అతిథి పూజ గావించెన్ ॥మా॥

ధనమునకై పర[illegible] [illegible]ది గుణములతో మెలగు॥

13 చల్లని మనసుతో అనసూయదేవి
పిల్లరెందరని యడిగెన్
గొల్లున ఏడ్చుచు మరుద్వతీసతి
పిల్లలు లేరని పలికెన్ ॥మా॥

14 క్రోదావేశముతో అనసూయ
బాదపడుచు నిటు పలికెన్
గొడ్రాలివయ్యె అతిథి పూజలు
గొప్పగ చేసితివెటులన్ ॥మా॥

15 సంతులేని వారింట అతిథులకు
సన్మానముతగదనియెన్
అంతమరుద్వతి నవమానించి
అరిగెను తన నెలవునకున్ ॥మా॥

16 అంతట మృకండు డశ్రుదారలతో
అరుదెంచియు తా కూర్చుండన్
అవమానముతో నున్న మరుద్వతి
అభిప్రాయ మెరిగింపన్ ॥మా॥

17 తరుణీమణి! సంతానము గూర్చి
తపమునకు పోయి వత్తున్
చింతవలదు శంభుని వరంబుతో
సంతుబడసెదను త్వరగన్ ॥మా॥

18 అనుచుమృకండుండామరుధ్వతి
ఆజ్ఞతో అడవికి జేరెన్
అనువుగతపముకు సరిపడు స్థలమును
కనుగొనియట గూర్చుండెన్ ॥మా॥

19 వ్యాఘ్రచర్మమున గూర్చుండియుతా
పారవశ్యమున నుండెన్
వాయు భక్షణము చేయుచునాముని
వదలక ఈశుని వేడెన్ ||మా||

20 పద్మాసనమును వేసికొన్నాండ్లు
పరమేశ్వరుని గొలువన్
బగబగ ఎండలోతనువు మాడ్పించి
ఫాలలోచనా! యనియెన్ ||మా||

21 నవరంధ్రమ్ములు మూసికొన్నాండ్లు
నాగభూషణుని వేడెన్
బువిపై శిరమును మోపి కొన్నాండ్లు
బవుని కొరకు తపియించెన్ ||మా||

22 చలికాలంబున మంచుకొండలో
చలించక తపము చేసెన్
పులిచర్మాంబర! కరినమేల! యని
అలసి పోయితానుండెన్ ||మా||

23 నటరాజా! నాగతి నీవేయని
నయనముల నీరు గార్చెన్
తటకునరమ్మిటు నిటలనయన! నే
తాళజాలనని పలికెన్ ||మా||

24 గంగాదరుడు షల్లున వచ్చియు
కనబడి మృకండు బిలువన్
కనులు తెరచి మునివరుడు శంకరుని
కాళ్ళపైనబడి మ్రొక్కెన్ ||మా||

25 సంతానముకొరకై తపించితి
సాంబసదాశివ! యనగన్
చింతదీర్చెదను సంతునిచ్చెదను
చీకాకుపలదని పలికెన్ ॥మా॥

26 శతవత్సరముల దుర్గుణుండగు
సుతుడొక్కడు కావలెనా?
మతి మంతుడు అల్పాయుష్యము గల
మాన్యుడొకడు కావలెనా? ॥మా॥

27 అదివిని మృకండుడాలోచించి
ఆదిభిక్షుగొని యాడెన్
అల్పాయుష్యము గల మేధావిని
అందించుమటని వేడెన్ ॥మా॥

28 పదునారేండ్లాయుష్యము గలిగిన
బాలునిచ్చి హరు డేగెన్
మది సంతోషంబొంది మృకండుడు
మరుద్వతి చెంతకేగెన్ ॥మా

29 ఆదంపతులన్యోన్య దాంపత్య
మనుభవించి సుఖపడగన్
హరుని అనుగ్రహమున మరుద్వతి
అపుడే గర్భము దాల్చెన్ ॥మా॥

30 నవమాసంబులు నిండి మరుద్వతి
నందను గనుగొని మురిసెన్
భువిలో బాలుని జాతక కర్మను
బుదజనులతో జేయించెన్ ॥మా॥

31 మాఘశుద్ధ తదియ సోమవారము
మార్కండేయుడు బుట్టేన్
మౌనివరుల రప్పించి శుభదినం
బందు పేరు బెట్టించెన్ ॥మా॥

32 మార్కండేయుండనెడి నామ మిడి
మౌని గణంబులు వెడలెన్
మహాభాగ్యమని మార్కండేయుని
మరుద్వతీసతి పెంచెన్ ॥మా॥

33 శుక్ల పక్ష చంద్రుని మించియుతా
సుందర బాలకుడెదిగెన్
చూపరులందరి మన్ననలందుచు
చూడముచ్చటగనుండెన్ ॥మా॥

34 పంచాబ్దంబులు నిండగ బాలుని
పాఠశాలలో చేర్పించెన్
అంచితంబుగ చతుర్వేదముల
పొంచిపొంచి చదువగ సాగెన్ ॥మా॥

35 దినదినాభివృద్ధి చెందుచుండగ
దిగులు గలిగె తలిదండ్రులకున్
ఎనలేని దు ఖమావహించగ
మునినారదుడటకే తెంచెన్ ॥మా॥

36 వారి దు ఖములు నివారించుటకు
నారదుండిటుల పలికెన్
కోరికతో మార్కండేయుని హరు
జేరితపంబొన రించుమనెన్ ॥మా॥

37 పుత్ర వాత్సల్యమున దంపతులు
పుత్రుని విడజాలరైరి
పురహరుని గూర్చితపంబొనర్చగ
పూనితినని బాలుడు పలకన్ ॥మా॥

38 నిక్కంబుగనిను విడువజాలము
దిక్కెవ్వరు మాకనిరి
ఎక్కడిదీ పుత్రేషణ? మీకు
చక్కగ ఆలోచించుమనెన్ ॥మా॥

39 తల్లి దండ్రులెందరైరొతనువుకు
ఉల్లమందు గుర్తెరుగు మనెన్
వెల్లిపోదు ఎన్నాండ్లకైన మీ
వల్లలాభమేమున్న దనెన్ ॥మా॥

40 బాలుని వైరాగ్యముకు దంపతులు
బాధా మనస్కులగుచున్
ఫాలాక్షుని తపమాచరించుటకు
పంపిరి బాలుని త్వరగన్ ॥మా॥

41 తపమొనర్చుటకు మార్కండేయుడు
తక్షణ మడవికి జనియెన్
అపరశంకరునివలె బాలకుడు
ఆరాధన మొదలిడియెన్ ॥మా॥

42 ఇసుకను కుప్పగ చేసి లింగమును
ఇంపుమీర పూజించెన్
పశుపతి యితడే యని బావించి
పంచాక్షరి పఠియించెన్ ॥మా॥

43 త్రికాల సంధ్యలోనర్చుచు బాలుడు
త్రిశూలధారుని వేడెన్
అకాలమృత్యువు తొలంగవలెనని
అధిక శ్రద్ధ వహియించెన్ ॥మా॥

44 బాలుడీ విధము దీక్షవహించగ
కాలయముడు గుర్తెరిగెన్
పాలాక్షుండు ప్రసాదించిన పదు
నారేండ్లాయువు ముగిసెన్ ॥మా॥

45 బాలుని ప్రాణాల్ దీసుక రమ్మని
కాలుడు బటులను బంపెన్
గోలచేయుచును యమదూతలుముని
బాలుని చెంతకు జేరన్ ॥మా॥

46 మార్కండేయుడు తన్మయత్వమున
మహేశుపూజల మునిగెన్
మరణమాసన్నమైన దనుచుకిం
కరులు పాశమును వేయన్ ॥మా॥

47 భగభగ మంటలు మండు చుండి ఆ
బాలుని చుట్టుగ నిలచెన్
ఝుగ్ఝలు జెంది యమభటులు వెంటనె
దిగులుగ యమపురి కేగన్ ॥మా॥

48 అదియు చూచి యముడాగ్రహమ్ముతో
అపుడే మహిషమునెక్కెన్
అతి భయంకరాకారముదాల్చి
ఆముని బాలుని జేరెన్ ॥మా॥

49 బాలసూర్య ప్రకాశవదనుడగు
బాలుని యముండు గాంచెన్
జాలి గుండెతో సూర్యనందనుం
డాలోచించుచు నిలిచెన్ ॥మా॥

50 పాలలోచన! ప్రాణముగొనుటకు
కాలుండేతెంచెన్
నీలకంధరా! గతినీవేయని
ఆలింగనమున వేడెన్ ॥మా॥

51 అదిచూచియు యముడా బాలుని గని
ఆగ్రహించియిట్లని యెన్
విధిప్రకారము మరణము దప్పదు
ఎదురించుట తగదని యెన్ ॥మా॥

52 నిండుమనంబున మార్కండేయుడు
రెండు చేతులను మోడ్చెన్
దండధరా! నన్ననుగ్రహించి
త్వరలో పొమ్మని వేడెన్ ॥మా॥

53 కనులెర్రజేసి యమధర్మరాజు
కాలఫాశమును గొనియెన్
మునిబాలకుని మెడలో వేసియు
ముక్కోపముతో నుండెన్ ॥మా॥

54 హర హర శంకర! ఆపద్బాంధవ
సరగున రారా! గిరివాసా!
పరమేశ్వర! నా ప్రాణాధారా!
పాలించుము పన్నగ భూషా ॥మా॥

55 బాలుండిటు ప్రార్థించగ పాశము
నీలకంఠు మెడ చుట్టుకొనెన్
ఫాలాక్షుడు పటపటలింగంబున
శూలపాణియై కనబడియెన్ ॥మా॥

56 అగ్నినేత్రుడావేశము జెందియు
యమధర్మరాజు నెదురించెన్
అరరే ఎంతటి అహంకారివని
అపుడు శూలమున పొడిచెన్ ॥మా॥

57 పిడుగు పడిన చందంబునయముడు
ఒడలు మరచి పడిపోయెన్
తడబడి చూచిన మార్కండేయుడు
బడలికచే బయ మొందెన్ ॥మా॥

58 చిరంజీవి! మార్కండేయా! యని
శిరమున హస్తము మోపెన్
మరిఏ కోరిక విన్నవించుమని
మహేశ్వరుడు వచియించెన్ ॥మా॥

59 దయామయా! నా మొరాలకించి
ధర్మరాజు బ్రతికింపుమనెన్
నయముగ నీవన్నటుల చేతునని
నాగభూషణుడు పలికెన్ ॥మా॥

60 దండధరా! లెమ్మనుచు ఈశుడు క
మండల జలమును జల్లెన్
కొండవలెను నిలుచుండి కాలుడు
రెండు చేతులను మోడ్చెన్ ॥మా॥

61 చిరకాలము జీవించి జగతిలో
చిరంజీవివై నిలువుమనెన్
దరలో నీ సాటెవరులేరని
పురహరుండు దీవించెన్ ||మా||

62 భూమ్యాకాశములుండెడి వరకు
పుణ్యాత్ముడవై యుండువనెన్
కామ్యములను పండించుచు జగతికి
కల్పవృక్షముగ నుండుమనెన్ ||మా||

63 దివిపై నుండిన దేవగణంబులు
భువి మార్కండేయుని జేరన్
సవినయముగ సంపూర్ణ దీవనలు
సమర్పించి యిట్లనియెన్ ||మా||

64 లోకకళ్యాణమునకై ధరలో
నీకు కళ్యాణమనియెన్
ప్రాకటముగ దూమ్రవతీ సతిని
పరిణయమొనర్చి వెడలెన్ ||మా||

65 సావధానముగ మార్కండేయుడు
పావనయజ్ఞము జేయన్
బావనమౌని యజ్ఞకుండమున
బ్రహ్మతేజమున బుట్టెన్ ||మా||

66 కమల నాభుదరి జేరి బావనుడు
క్రమముగ తంతుల గొనియెన్
అమల చరితుడా రేకులతోడ
అద్భుత వస్త్రాల్ నేసెన్ ||మా||

# మహాయజ్ఞములలో స్వాహాకారములకు వినియోగపడు మహాగాయత్రి మంత్రములు



1 ఓమ్ ఉత్తిష్ఠంతు భూతపిశాచా సర్వేతే భూమిభారకా
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభేస్వాహా-అగ్నయ ఇదంనమమ

2 ఓమ్ భు ఓం భువ ఓగ్ం సువ ఓం మహా ఓం జన ఓం తప
ఓగ్ం సత్యమ్ ఓమ్ తత్సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి
ధియో యోన ప్రచోదయాత్ స్వాహా-ప్రాణాయామ ఇదంనమమ

3 ఓమాపోజ్యోతిరసో మృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్ స్వాహా
మాపోజ్యోతి ఇదంనమమ

## గురు గాయత్రి

4 ఓం గురుదేవాయ విద్మహే - పరబ్రహ్మణే ధీమహి
తన్నో గురు ప్రచోదయాత్ స్వాహా - గురుదేవాయ ఇదంనమమ
మూ॥ ఓం గుం గురు పరబ్రహ్మణే నమ

## గణేశ గాయత్రి

5 ఓం వక్రతుండాయ విద్మహే ఏకదంతాయ ధీమహి
తన్నో దంతి ప్రచోదయాత్ స్వాహా - ఏకదంతాయ ఇదంనమమ
మూ॥ ఓం గం గణపతయే నమః

## నారాయణ గాయత్రి

6 ఓం నారాయణాయ విద్మహే - వాసుదేవాయ ధీమహి
తన్నో విష్ణూ ప్రచోదయాత్ స్వాహా - వాసుదేవాయ ఇదంనమమ
మూ॥ ఓం నం ఓం శ్రీమన్నారాయణాయ నమః।

## లక్ష్మి గాయత్రి

7 ఓం మహాదేవ్యైచ విద్మహే - విష్ణు పత్న్యైచ ధీమహి
తన్నో లక్ష్మీ ప్రచోదయాత్ స్వాహా - లక్ష్మీ ఇదంనమమ
మూ॥ ఓం హ్రీం శ్రీం మహాలక్ష్మై నమ ॥

## విష్ణు గాయత్రి

8 ఓం విష్ణవేచ విద్మహే - వాసుదేవాయ ధీమహి
తన్నో విష్ణు ప్రచోదయాత్ స్వాహా - విష్ణవేఇదంనమమ
మూ॥ ఓం ఉపేంద్రాయ అ చింత్యాయ నమః॥

## శివ గాయత్రి

9 ఓం తత్పురుషాయ విద్మహే - మహాదేవాయ ధీమహి
తన్నో రుద్ర ప్రచోదయాత్ స్వాహా - రుద్రాయేదం నమమ
మూ॥ ఓం హ్రీం శ్రీం శివాయ నమః॥

## దుర్గా గాయత్రి

10 ఓం కాత్యాయ నాయ విద్మహే - కన్యాకుమారి ధీమహి
తన్నో దుర్గా ప్రచోదయాత్ స్వాహా - దుర్గాయేదంనమమ
మూ॥ ఓం హ్రీం హ్రీం దుర్గాయై నమః॥

## రుద్ర గాయత్రి

11 ఓం మహా దేవాయ విద్మహే - రుద్ర మూర్తయే ధీమహి
తన్నో శివ ప్రచోదయాత్ స్వాహా - శివాయ ఇదంనమమ
మూ॥ ఓం హ్రీం శ్రీం రుద్రాయ నమః॥

## గౌరీ గాయత్రి .

12 ఓం సుభగాయచ విద్మహే - కామ మాలాయ ధీమహీ
తన్నో గౌరీ ప్రచోదయాత్ స్వాహా - గౌరీ యేదంనమమ
మూ॥ ఓం క్లీం హ్రీం గౌం గౌర్యై నమః॥

## బ్రహ్మా గాయత్రి

13 ఓం వేదాత్మనాయ విద్మహే - హిరణ్య గర్భాయ ధీమహి
తన్నో బ్రహ్మా ప్రచోదయాత్ స్వాహా బ్రహ్మదేవాయ ఇదంనమమ
మూ॥ ఓం క్లీం శ్రీం బ్రహ్మదేవాయ నమః॥

వృధా చేయకు కాలమును! సదా మరువకు దైవమును!!

## సరస్వతి గాయత్రి

14 ఓం జ్ఞాన రూపాయ విద్మహే-బ్రహ్మప్రియాయ ధీమహి
తన్నోవాణీ ప్రచోదయాత్ స్వాహా - వాణీ యేదంనమమ
మూ॥ ఓం ఐం హ్రీం క్లీం సౌ ధీం సరస్వత్యైనమః॥

## కృష్ణ గాయత్రి

15 ఓం దేవకీ నందనాయ విద్మహే - వాసుదేవాయ ధీమహి
తన్నో కృష్ణ ప్రచోదయాత్ స్వాహా - కృష్ణా యేదంనమమ
మూ॥ ఓం క్లీం కృష్ణాయ నమ ॥

## దేవీ గాయత్రి

16 ఓం దేవీ బ్రహ్మణీ విద్మహే-మహా శక్తైచ ధీమహి
తన్నో దేవీ ప్రచోదయాత్ స్వాహా - దేవీ ఇదంనమమ
మూ॥ ఓం హ్రీం శ్రీం క్లీం నమ సోఽహమ్॥

## రామ గాయత్రి

17 ఓం దాశరథాయ విద్మహే - సీతావల్లభాయ ధీమహి
తన్నో రామ ప్రచోదయాత్ స్వాహా - రామాయ ఇదంనమమ
మూ॥ ఓం హ్రాం హ్రీం రాం రామాయ నమః॥

## సీతామాత గాయత్రి

18 ఓం సీతా మాతాయ విద్మహే - జనక సుతాయ ధీమహి
తన్నో జానకీ ప్రచోదయాత్ స్వాహా - జానకీ ఇదంనమమ
మూ॥ ఓం శ్రీం భూజాతాయ నమః॥

## గోపాల గాయత్రి

19 ఓం గోపాలాయ విద్మహే - గోపీ జనవల్లభాయ ధీమహి
తన్నో గోపాల ప్రచోదయాత్ స్వాహా - గోపాలాయ ఇదంనమమ
మూ॥ ఓం గోపాలాయ గోచరాయ వంశ శబ్దాయ నమః॥

## హనుమద్గాయిత్రి

20 ఓం అంజనీజాయ విద్మహే - వాయు పుత్రాయ ధీమహి
తన్నో హనుమాన్ ప్రచోదయాత్ స్వాహా - అంజనేయాయ ఇదంనమమ
ము॥ ఓం హ్రోం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఓం హం
హనుమతే రామదూతాయ నమః॥

## వేంకటేశ గాయత్రి

21 ఓం వేంకటేశాయ విద్మహే - శ్రీమన్నాథాయ ధీమహి
తన్నో శ్రీశ ప్రచోదయాత్ స్వాహా - వేంకటేశాయ ఇదంనమమ
ము॥ ఓం శ్రీం వేంకటేశాయ నమః॥

## సంతోషమాత గాయత్రి

22 ఓం సంతోషీణ్యైచ విద్మహే - సౌభాగ్యణ్యైచ ధీమహి
తన్నో సంతోషీ ప్రచోదయాత్ స్వాహా - సంతోషి ఇదంనమమ
ము॥ ఓం శ్రీం క్లీం సంతోషీమాతాయై నమః॥

## సుదర్శన గాయత్రి

23 ఓం సుదర్శనాయ విద్మహే - మహాబలాయ ధీమహి
తన్నో చక్ర ప్రచోదయాత్ స్వాహా - సుదర్శనాయ ఇదంనమమ
ము॥ ఓం నారాయణాస్త్రాయ నమః॥

## పాశుపతాస్త్ర గాయత్రి

24 ఓం పాశు పతాస్త్రాయ విద్మహే - మహాశక్త్యైచ ధీమహి
తన్నో అస్త్ర ప్రచోదయాత్ స్వాహా - పాశుపతాస్త్రాయ ఇదంనమమ
ము॥ ఓం శం శివ శక్త్యాయ నమః॥

## కామధేను గాయత్రి

25 ఓం కామదేనూచ విద్మహే - కరుణ హృదయాయ ధీమహి
తన్నోసురభి ప్రచోదయాత్ స్వాహా - సురభి ఇదంనమమ
ము॥ ఓం శ్రీం క్లీం కామదేను స్సురముని పాలకాయ నమః॥

[illegible] సేవచేయుము! [illegible] హృదయము ము ధన్యమగును!!

## కల్పవృక్ష గాయత్రి

26 ఓం వృక్ష రాజాయ విద్మహే - జీవ రక్షాయ ధీమహి
తన్నోతరు ప్రచోదయాత్ స్వాహో - వృక్షరాజాయ ఇదంమమ
మూ॥ ఓం క్లీం శ్రీం క్లీం కల్ప వృక్షాయ నమః॥

## హంస గాయత్రి

27 ఓం పరమ హంసాయ విద్మహే - మహో తత్త్వాయ ధీమహి
తన్నో హంస ప్రచోదయాత్ స్వాహో - హంసా యేదం నమమ
మూ॥ ఓం సోహం సోహం హంసదేవాయ నమ ॥

## గరుడ గాయత్రి

28 ఓం తత్పురుషాయ విద్మహే - స్వర్ణ పక్షాయ ధీమహి
తన్నో గరుడ ప్రచోదయాత్ స్వాహో - గరుడా యేదంనమమ
మూ॥ ఓం గ్రాం గ్రీం గ్రూం గ్రైం గ్రౌం గ్రః గరుడాయ నమః॥

## నృసింహా గాయత్రి

29 ఓం ఉగ్ర నృసింహాయ విద్మహే - వజ్ర నఖాయ ధీమహి
తన్నో నృసింహా ప్రచోదయాత్ స్వాహో - నృసింహాయ ఇదంనమమ
మూ॥ ఓం నృం నృం నృం నృసింహాయ నమః॥

## జల గాయత్రి

30 ఓం జల బింబాయ విద్మహే - నీల పూర్ణాయ ధీమహి
తన్నో అంబు ప్రచోదయాత్ స్వాహో - జలబింబాయ ఇదంనమమ
మూ॥ ఓం జం జం ఓం వం వం ఓం లం లం నమః॥

## సుబ్రహ్మణ్య గాయత్రి

31 ఓం తత్పురుషాయ విద్మహే - మహో సేనాయ ధీమహి
తన్నో షణ్ముఖ ప్రచోదయాత్ స్వాహో - షణ్ముఖ ఇదంనమమ
మూ॥ ఓం శరవణ భవ నమః॥

## దత్తాత్రేయ గాయత్రి

32 ఓం తత్పురుషాయ విద్మహే - అత్రిపుత్రాయ ధీమహి
తన్నోదత్త ప్రచోదయాత్ స్వాహా - దత్తాత్రేయాయ ఇదంనమమ
మూ॥ ఓం శ్రీం గుం గురుదేవ దత్త నమః॥

## అగ్ని గాయత్రి

33 ఓం మహాజ్వాలాయ విద్మహే - అగ్నిమధ్యాయ ధీమహి
తన్నో అగ్ని ప్రచోదయాత్ స్వాహా - అగ్నియే ఇదంనమమ
మూ॥ ఓం అం అగ్నయే నమః॥

## వాయు గాయత్రి

34 ఓం పవమానాయ విద్మహే - ధూ మ్ర వర్ణాయ ధీమహి
తన్నో వాయుః ప్రచోదయాత్ స్వాహా - వాయువే ఇదంనమమ
మూ॥ ఓం శ్రీం వాయువే నమః॥

## భృగు గాయత్రి

35 ఓం తత్పురుషాయ విద్మహే - బ్రహ్మపుత్రాయ ధీమహి
తన్నో భృగు ప్రచోదయాత్ స్వాహా - భ్రగువే ఇదంనమమ
మూ॥ ఓం భృగు మహర్షై నమః॥

## ఆదిశేష గాయత్రి

36 ఓం ఉర్వీధరాయ విద్మహే - మహా నాగాయ ధీమహి
తన్నో శేష ప్రచోదయాత్ స్వాహా - శేషా ఇదంనమమ
మూ॥ ఓం ఓం నాగ రాజాయ నమః॥

## అమృత గాయత్రి

37 ఓం సుధా దేవ్యైచ విద్మహే - సర్వ సిద్ధ్యైచ ధీమహి
తన్నో సుష్టి ప్రచోదయాత్ స్వాహా - సుదా దేవ్యై ఇదంనమమ
మూ॥ ఓం లం శ్రీం క్లీం ఓం అమృతాయ నమః॥

## మత్స్య గాయత్రి

38 ఓం తత్పురుషాయ విద్మహే - మహా మీనాయ ధీమహి
తన్నో మత్స్యః ప్రచోదయాత్ స్వాహా - మీనాయ ఇదంనమమ
ము॥ ఓం నమో మత్స్య స్వరూపాయ నమః॥

## భూ గాయత్రి

39 ఓం ధనుర్ధరాయ విద్మహే - సర్వ సిద్ధిచ ధీమహి
తన్నోధరా ప్రచోదయాత్ స్వాహా - వసుద ఇదంనమమ
ము॥ ఓం లం భూ మాతాయ నమః॥

## పాండురంగ గాయత్రి

40 ఓం రుక్మిణీశాయ విద్మహే - పాండు రంగాయ ధీమహి
తన్నో మాధవ ప్రచోదయాత్ స్వాహా - పాండురంగాయ ఇదంనమమ
ము॥ ఓం జయ పాండు రంగాయ నమః॥

## మార్కండేయ గాయత్రి

41 ఓం ముని నాథాయ విద్మహే - మార్కండేయాయ ధీమహి
తన్నో ఋషి ప్రచోదయాత్ స్వాహా - మార్కండేయాయ ఇదంనమమ
ము॥ ఓం శివభక్త మార్కండేయాయ నమః॥

## యంత్ర గాయత్రి

42 ఓం యంత్ర రాజాయ విద్మహే - స్వర్ణాక్షరాయ ధీమహి
తన్నో యంత్ర ప్రచోదయాత్ స్వాహా - యంత్రాయ ఇదంమమ
ము॥ ఓం యంత్ర రాజాయ నమః॥

## మంత్ర గాయత్రి

43 ఓం మంత్ర రాజాయ విద్మహే - బీజాక్షరాయ ధీమహి
తన్నో మంత్ర ప్రచోదయాత్ స్వాహా - మంత్రాయ ఇదంనమమ
ము॥ ఓం మంత్ర బీజాక్షరాయ నమః॥

## నవగ్రహా గాయత్రీ మంత్రమ్ములు

### సూర్య గాయత్రి

44 ఓం భాస్కరాయ విద్మహే - మహాతేజాయ ధీమహి
తన్నో సూర్యః ప్రచోదయాత్ స్వాహా - సూర్యా యేదంనమమ
మూ॥ ఓం హ్రాం హ్రీం హ్రౌం స సూర్యాయ నమః॥

### చంద్ర గాయత్రి

45 ఓం క్షీర పుత్రాయ విద్మహే - అమృత తత్వాయ ధీమహి
తన్నోచంద్ర ప్రచోదయాత్ స్వాహా - చంద్రా యేదంనమమ
మూ॥ ఓం శ్రాం శ్రీం శ్రౌం స చంద్రాయ నమః॥

### కుజ గాయత్రి

46 ఓం దరా సుతాయ విద్మహే - ఋణ విముక్తాయ ధీమహి
తన్నోభౌమ ప్రచోదయాత్ స్వాహా - భౌమాయేదం నమమ
మూ॥ ఓం క్రాం క్రీం క్రౌం స భౌమాయనమః॥

### బుధ గాయత్రి

47 ఓం చంద్రపుత్రాయ విద్మహే - సౌమ్య నామాయ ధీమహి
తన్నో బుధ ప్రచోదయాత్ స్వాహా - బుధా యేదంనమమ
మూ॥ ఓం బ్రాం బ్రీం బ్రౌం స బుధాయ నమః॥

### బృహస్పతి గాయత్రి

48 ఓం గురు దేవాయ విద్మహే - మహా పండితాయ ధీమహి
తన్నో బృహస్పతిః ప్రచోదయాత్ స్వాహా - గురుదేవాయ ఇదంనమమ
మూ॥ ఓం హ్రాం హ్రీం హ్రౌం స బృహస్పతియే నమః॥

### శుక్ర గాయత్రి

49 ఓం అసుర రక్షాయ విద్మహే - సర్వశాస్త్రాయ ధీమహి
తన్నో భార్గవ ప్రచోదయాత్ స్వాహా - శుక్రాయేదంనమమ
మూ॥ ఓం ద్రాం ద్రీం ద్రౌం స శుక్రాయ నమః॥

**పూర్వ సాంప్రదాయాల పునాదులుగా భావించి రక్షించుము.**

## శని గాయత్రి

౫0 ఓం నీల దేహాయ విద్మహే - సూర్య పుత్రాయ ధీమహి
తన్నో మంద ప్రచోదయాత్ స్వాహా - శనియే ఇదంనమమ
ము॥ ఓం క్షాం క్షీం క్షౌం స శనియేనమః॥

## రాహు గాయత్రి

51 ఓం అర్ధకాయాయ విద్మహే - మహా వీరాయ ధీమహి
తన్నో రాహుః ప్రచోదయాత్ స్వాహా - రాహువే ఇదంనమమ
ము॥ ఓం భ్రాం భ్రీం భ్రౌం స రాహువే నమః॥

## కేతు గాయత్రి

52 ఓం తత్పురుషాయ విద్మహే - చిత్ర విచిత్రాయ ధీమహి
తన్నో కేతుః ప్రచోదయాత్ స్వాహా - కేతువే ఇదంనమమ
ము॥ ఓం ప్రాం ప్రీం ప్రౌం స కేతవే నమః॥

## అష్టదిక్పాలక గాయత్రీ మంత్రములు

## ఇంద్ర గాయత్రి

53 ఓం దేవ రాజాయ విద్మహే - వజ్ర హస్తాయ ధీమహి
తన్నో ఇంద్ర ప్రచోదయిత్ స్వాహా - ఇంద్రాయేదంనమమ

## అగ్ని గాయత్రి

54 ఓం దేవ రాజాయ విద్మహే - జ్వాల మాలాయ ధీమహి
తన్నో అగ్ని ప్రచోదయాత్ స్వాహా అగ్నియ ఇదంనమమ

## యమ గాయత్రి

55 ఓం వై వస్వతాయ విద్మహే - దండ హస్తాయ ధీమహి
తన్నో యమ ప్రచోదయాత్ స్వాహా - యమాయేదంనమమ

### నైఋతి గాయత్రి

56 ఓం నిశాచరాయ విద్మహే - ఖడ్గహస్తాయ ధీమహి
తన్నో నైఋతి ప్రచోదయాత్ స్వాహా నైఋత్యాయేదంనమమ

### వరుణ గాయత్రి

57 ఓం శుద్ధి చరాయ విద్మహే - పాశహస్తాయ ధీమహి
తన్నో వరుణ ప్రచోదయాత్ స్వాహా - వరుణా యేదంనమమ

### వాయు గాయత్రి

58 ఓం జగత్ప్రాణాయ విద్మహే - గంధ వాహాయ ధీమహి
తన్నో వాయుః ప్రచోదయాత్ స్వాహా - వాయువే ఇదంనమమ

### కుభేర గాయత్రి

59 ఓం అత్రి పురుషాయ విద్మహే - మహా ధనాయ ధీమహి
తన్నో కుబేరః ప్రచోదయాత్ స్వాహా - కుభేరాయేదంనమమ

### ఈశాన గాయత్రి

60 ఓం ఈశాన్యాయాయ విద్మహే - యశస్స్వరూపాయ ధీమహి
తన్నో ఈశానః ప్రచోదయాత్ స్వాహా - ఈశాన్యాయ ఇదంనమమ

శుభం భూయాత్ !





## ద్వాదశ జ్యోతిర్లింగస్తోత్రం

శ్లో॥ సౌరాష్ట్రే సోమ నాథంచ - శ్రీశైలే మల్లికార్జునం
ఉజ్జయిన్యాం మహా కాళం - ఓం కారే త్వమ లేశ్వరమ్ ॥

శ్లో॥ ప్రజ్వల్యాం వైద్య నాథంచ - ఢాకిన్యాం భీమ శంకర
సేతు బంధేతు రామేశం - నాగేశం దారుకావనే ॥

శ్లో॥ వారాణ స్యాంతు విశ్వేశం - త్ర్యంబకం గౌతమీ తటే
హిమాల యేతు కేదారం - ఘృష్ణే శంచ విశాలకే ॥

శ్లో॥ ఏతాని జ్యోతిర్లింగాని - సాయం ప్రాతః పఠేన్నర
సప్త జన్మ కృతం పాపం - స్మరణేన వినశ్యతి ॥



## శ్రీ సాయినాథస్తోత్రము

ప్రథమం సాయినాథాయ ద్వితీయం ద్వారకమాయినే
తృతీయం తీర్థరాజాయ చతుర్థం భక్తవత్సలె
పంచమం పరమాత్మాయ, షష్ఠంచ షిరిడివాసినే
సప్తమం సద్గురునాథాయ అష్టమం అనాథనాథనే
నవమం నిరాడంబాయ దశమం దత్తావతారనే
ఏతాని దశ నామాని త్రిసంధ్య యు పఠేన్నరః
సర్వకష్ట భయాన్ముకో సాయినాథ గురో కృపా

## పరమేశ్వర ప్రార్థన



శ్లో॥ పూర్వం పశుపతి పాతు । దక్షిణే పాతు శంకరః
పశ్చిమే పాతు విశ్వేశో । నీలకంఠ స్తథోత్తరే
ఈశాన్యం పాతు మే శర్వః । ఆగ్నేయాం పార్వతీప
నైరుత్యాం పాతు మే రుద్రో । వాయవ్యం నీలలోహి
ఊర్ధ్వే త్రిలోచనః పాతు । అధరాయాం మహేశ్వర
ఏతేభ్యో దశ దిగస్తు । సర్వత పాతు శంకర ।

## శ్రీ మహావిష్ణు షోడశనామ స్తుతి



ఔషధే చింతయే ద్విష్ణుం। భోజనే చ జనార్ధనమ్।
శయనే పద్మనాభం చ। వివాహే చ ప్రజాపతిమ్।
యుద్ధే చక్రధరం దేవం। ప్రవాసే చ త్రివిక్రమమ్।
నారాయణ తనుత్యాగే। శ్రీధరం ప్రియసంగమే।
దుస్స్వప్నే స్మర గోవిందం। సంకటే మధుసూదనమ్।
కాననే నారసింహం చ। పావకే జలశాయినమ్।
జలమధ్యే వరాహం చ। పర్వతే రఘునందనమ్।
గమనే వామనం చైవ। సర్వకాలేషు మాధవమ్।
షోడశైతాని నామాని। ప్రాతరుత్థాయ యః పఠేత్।
సర్వపాప వినిర్ముక్తో। విష్ణులోకే మహీయతే॥

# అష్టాదశ శక్తి పీఠములు



లంకాయాం శాంకరీదేవి కామాక్షీ కంచికాపురీ
ప్రద్యుమ్నే శృంగళాదేవీ చాముండే క్రమంచ పట్టణే
అలంపురీ జోగులాంబ శ్రీశైలే భ్రమరాంభికా
కొల్హాపురీ మహాలక్ష్మీ మాహుర్యే ఏకవీరికా
ఉజ్జయిన్యాం మహాంకాళీ పీఠికాయాం పురుహూతికా
ఓఢ్యాయాం గిరిజాదేవీ మాణిక్యే ద్రాక్షవాటికా
హరిక్షేత్రే కామరూపి ప్రయాగే మాధవేశ్వరీ
జ్వాలయాం వైష్ణవీదేవీ గయా మంగళ్యగౌరికా
వారణాశీ విశాలక్షి, కాశ్మీరేతు సరస్వతీ
అష్టాదశ పీఠాని యోగినామతి దుర్లభం
సాయంకాలం పఠేన్నిత్యం సర్వశత్య వినాశనం
సర్వదివ్యహరం రోగం సర్వ సంపత్కరం శుభం



# అష్టలక్ష్మీ స్తుతి



1 ఓం రథమద్యాం ఋ క్ష్మపూర్వాం గజవాద ప్రబోధినీం
సామ్రాజ్య దాుుుగీం దేవీం గజలక్ష్మీనమామ్యహమ్॥

2 ఓం ధనమగ్నిర్ధసు వాయు ధనం భూతాని పంచచ
ప్రభూతైశ్వర్య సందాత్రీం ధనలక్ష్మీనమామ్యహమ్॥

3 ఓం పృథ్వీ గర్భసముద్భిన్న నానాప్రీహి స్వరూపిణిం
పశు సంపత్స్వరూపంచ ధాన్యలక్ష్మీనమామ్యహం॥

4 ఓం నమాత్సర్యం నచక్రోదోనభీతిర్నచ భేదది
యుద్ధాక్తానాం వినీనాం ధైర్యలక్ష్మీం నమామ్యహం

5 ఓం పుత్ర పౌత్ర స్వరూపేణ పశుభృత్యాత్మనా స్వయం
సంభవన్తీంచ సంతాన లక్ష్మీం దేవీం నమామ్యహం

6 ఓం నానా విజ్ఞాన సందాత్రీం బుద్ధి శుద్ధి ప్రదాయినీం
అమృతత్వ ప్రదాత్రీంచ విద్యాలక్ష్మీం నమామ్యహం

7 ఓం నిత్య సౌభాగ్య సౌశీల్యం వరలక్ష్మీం దదాతిమా
ప్రసన్నాం స్త్రైణ సులభాం ఆది లక్ష్మీం నమామ్యహం

8 ఓం సర్వేశక్తి స్వరూపాంచ సర్వసిద్ధి ప్రదాయినీం
సర్వేశ్వరీం శ్రీవిజయ లక్ష్మీం దేవీ నామామ్యహం

9 ఓం అష్ట లక్ష్మీనమాహార స్వరూపాంతాం హరిప్రియాం
మోక్షలక్ష్మీం మహాలక్ష్మీం సర్వలక్ష్మీం నమామ్యహం
దారిద్ర్య దు ఖహరణం సమృద్ధి రససంపదాం
సచ్చిదానంద పూర్ణత్వం అష్టలక్ష్మీం స్తుతేర్భవేత్

దీనిని రోజు 8 సార్లు పఠించిన వారికి ఆయురారోగ్యాది
సకల సంపదలు గలుగును

అంత కరణశుద్ధిగ ఉంటేనే అన్నిట విజయము కలుగును

# సద్గురు స్తవము



సిద్ధి బుద్ధి మహాయోగ వరణీయో గణాధిపః ।
యస్స్వయం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥
యస్య దత్తాత్రేయ భావో భక్తానా మాత్మ దానత ।
సూచ్యతే సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥
యోగాజ్యోతి స్సమద్దీప్తం జయలక్ష్మీ నృసింహయో ।
అద్వయం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥
యోగవిద్యా చిత్రభాను చిత్రభాను శరద్భవం ।
జ్ఞానదం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥
గణేశ హోమేజర్కదినే నిత్యం శ్రీచక్ర పూజనే ।
దీక్షితం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥
అగస్త్యముని సంక్రాంత నానా వైద్య ధురంధరమ్ ।
భవఘ్నం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ।
వాద్యోదంచ ద్దివ్యనామ సంకీర్తన కళానిధిమ్ ।
నాదాబ్ధిం సచ్చిదానందం సద్గురు తం నమామ్యహమ్ ॥
దత్త పీఠాధిపం ధర్మ రక్షణోపాయ బంధురమ్ ।
సత్కవిం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ॥
విధూత భక్త సమ్మోహ మవధూతం జగద్గురుమ్
స్వాశ్రయం సచ్చిదానందం సద్గురుం తం నమామ్యహమ్ ।
సాధుత్వం భక్తిమైశ్వర్యం దానం యోగ మరోగతామ్ ।
సన్మతిం జ్ఞాన మానందం సద్గురుం స్తవతో లభేత్ ॥

ఈ స్తవము రోజు 10 సార్లు పఠించిన వారికి అష్టసిద్ధులు గులుగును

[illegible] మోపగించినచో గాడిదవై పుట్టెదవు

## నిత్యానుష్ఠానము :



ఉదయము పడక నుండి లేచు సమయమున రెండు చేతులను దర్శించి నమస్కరించుట

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీ - కరమధ్యే సరస్వతి
కరమూలే స్థితా విష్ణు ప్రభాతే కురు దర్శనమ్ ॥

### భూమిపై పాదములు మోపువేళ

శ్లో॥ సముద్ర వసనే దేవి - పర్వత స్తన మండలే
విష్ణు పత్ని నమస్తుభ్యం - పాదస్పర్శ క్షమ స్వమే ॥

### స్నానము చేయువేళ

శ్లో॥ గంగేచ యమునే కృష్ణే - గోదావరి సరస్వతి
నర్మదా సింధు కావేరి - జలేస్మిం త్సన్నిధింకురు॥

### సూర్య నమస్కారము

శ్లో॥ బ్రహ్మ స్వరూపముదయే - మధ్యాహ్నాంతు మహేశ్వరు
సాయంధ్యాయే సదా విష్ణు - త్రిమూర్తించ దివాకరు॥

### గురు ధ్యానము

శ్లో॥ గురుర్బ్రహ్మగురు ర్విష్ణు - ర్గురు దేవో మహేశ్వరః
గురు సాక్షత్పర బ్రహ్మ - తస్మైశ్రీ గురవే నమః ॥

### గణేశ ధ్యానము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం-శశి వర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయే - త్సర్వ విఘ్నోప శాంతయే ॥

## స్థల శుద్ధి మంత్రము

శ్లో॥ అప స్సర్పంతు యే భూతా - యే భూతా మభి సంస్థితా
యేభూతా విఘ్న కర్తార - స్తే నశ్యంతు శివాజ్ఞయా॥

## శరీర శుద్ధి మంత్రము

శ్లో॥ అపవిత్ర పవిత్రోవా - సర్వావస్థాం గతోపివా
యస్మరే త్పుండరీ కాక్ష - సబాహ్యాభ్యంతరశ్శుచి ॥

## విబూతి దారణ మంత్రము

శ్లో॥ శ్రీకరంచ పవిత్రంచ - శోక రోగ నివారణమ్
లోకే వశీకరం ప్రోక్తం - భస్మం త్రైలోక్య పావనమ్ ॥

## శ్రీ చూర్ణ దారణ మంత్రము

శ్లో॥ శంఖ చక్ర గదా పాణే - ద్వారకా నిలయాచ్యుత
గోవింద పుండరీ కాక్ష - రక్షమాం శరణా గతమ్ ॥

## కుంకుమ దారణ మంత్రము

శ్లో॥ ఓం కార పంజర శుకీం - ఉపనిషదు ద్యానకేళి కలకంఠీం
ఆగమ విపన మయూరి - మార్యా మంతర్వి భావయే గౌరీం ॥

## ఘంటానాద మంత్రము

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం - గమనార్థంతు రక్షసామ్
కురు ఘంటా రవం తత్ర - దేవతా హ్వానలాం చనమ్ ॥

## సుదర్శన మంత్రము

శ్లో॥ సుదర్శనం మహా వేగం - గోవిందస్య ప్రియా యుధమ్
జలత్పావక సంకాశం - సర్వ శత్రు వినాశనమ్ ॥

## మృత్యుంజయ మంత్రము

శ్లో॥ త్ర్యంబకం యజా మహే సుగంధిం పుష్టి వర్ధనమ్
ఉర్వారుక మివ బందనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥

## శ్రీ రామ మంత్రము

శ్లో॥ శ్రీ రామచంద్రం శ్రితపారిజాతం-సమస్త కళ్యాణ గుణాభిరామం
సీతా ముఖాం బోరుహచంచరీకో - నిరంతరం మంగళమాత నోతు ॥

## శ్రీ కృష్ణ మంత్రము

శ్లో॥ మందార మాలే మదనాభి రామం - బింబాదరా పూరిత వేణునాదం
గో గోప గోపీ జన మధ్య సంస్థం - గోపంబజే గోకుల పూర్ణచంద్రమ్ ॥

## దక్షిణా మూర్తి మంత్రము

శ్లో॥ గురవే సర్వ లోకానాం - భిషజే భవ రోగిణాం
నిధయే సర్వ విద్యానాం - దక్షిణా మూర్తయే నమ ॥

## సరస్వతీ మంత్రము

శ్లో॥ సరస్వతీ నమస్తుభ్యం - వరదే కామ రూపిణి
విద్యారంభం కరిష్యామి - సిద్ధిర్భవతు మే సదా ॥

## సరస్వతీ జప బీజ మంత్రము

ఓం ఐం హ్రీం క్లీం సౌః ధీం సరస్వత్యై నమ ॥

## ఈశ్వర మంత్రము

శ్లో॥ విశ్వేశ్వర విరూపాక్ష - విశ్వరూప సదాశివ
శరణం భవ భూతేశ - కరుణాకర శంకర ॥

## వేంకటేశ్వర మంత్రము

శ్లో॥ నమో శ్రీ వేంకటేశాయ - పురుషాధ్యో మహాత్మనే
ప్రణుత క్లేశ నాశాయ - గోవిందాయ్యనమో నమ ॥

## ఆంజనేయ మంత్రము

శ్లో॥ ఆంజనేయం మహా వీరం - బ్రహ్మావిష్ణు శివాత్మకం
తరుణార్క ప్రభో దాత - రామ దూతం నమామ్యహమ్ ॥

## సత్యనారాయణ ము

శ్లో॥ సత్యనారాయణం దేవం - వందేహం కామదం ప్రభుం
లీలాయా వితతం విశ్వం - యేనతస్మై నమో నమ ॥

## మార్కండేయ మంత్రము

శ్లో॥ పద్మోద్భవ దయా పాత్రం - పద్మశాఖ ప్రవర్తకర
లోకోపకార నిరతం - మార్కండేయ మునిం భజే ॥

## నందీశ్వర మంత్రము

శ్లో॥ నందీశ్వర నమస్తుభ్యం - శాంతానంద ప్రదాయకం
మహా దేవేశ సేవార్థం - అనుజ్ఞారాతు మర్హసి ॥

## దేవీ మంత్రము

శ్లో॥ వాగ్దేవీ మహా కాళీం - మహా లక్ష్మీం సరస్వతీం
త్రిశక్తి రూపిణీ మంబాం - దుర్గాం చండీం నమామ్యహమ్ ॥

## గీతా మంత్రము

శ్లో॥ గీతా గంగాచ గాయత్రి - సీతా సత్య సరస్వతి
బ్రహ్మ విద్యా బ్రహ్మ వల్లీం - త్రిసంధ్యా ముక్తి గేహినీ ॥

## శమీ (జమ్మి) మంత్రము

శ్లో॥ శమీ శమీయతే పాపం - శమీ శత్రు వినాశని
అర్జునస్య దనుర్ధారి - రామస్య ప్రియ దర్శనీ ॥

## నిత్యం బుద్ధి - కీర్తి ప్రాప్తి మంత్రము

శ్లో॥ బుద్ధిం దేహి యశోదేహి - కవిత్వం దేహి దేహియే
మూఢత్వంచ హరే దేవి - త్రాహి నీల సరస్వతీ ॥

[illegible]

## గరుడ మంత్రము

శ్లో॥ కుంకు మాంకిత వర్ణాయ - కుందేందు దవళాయచ
విష్ణు వాహన నమస్తుభ్యం - పక్షి రాజాయ తేనమః॥

## అశ్వత్థ (రావి) మంత్రము

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ-మధ్యతో విష్ణు రూపిణే
అగ్రతశ్శివ రూపాయ - వృక్ష రాజాయ తే నమ ॥

## ఔషధ సేవా మంత్రము

శ్లో॥ దన్వంతరం గరుత్మంతం - ఫణి రాజంచ కౌస్తుభం
అచ్యుతం చామృతం చంద్రం - స్మరే దౌషద కర్మణి ॥

## రాఘవేంద్ర మంత్రము

శ్లో॥ ఆగమ్య మహిమా లోకే - రాఘవేంద్రో మహాశయ
శ్రీ మధ్వ మత దుగ్ధాబ్ధి - చంద్రోవతు సదా నఘ ॥

## భగవాన్ సత్యసాయి మంత్రము

శ్లో॥ శ్రీ సత్యసాయి కరుణాకర పుణ్య కీర్తే
స్వామిన్ దయా మమ గృహాణ శుభాక్ష దృష్టే
పుష్పాణి జాజి కరవీర రసాల కాని
మాలాంశ్చ రుక్మి మణి మౌక్తిక రంజితాశ్చ ॥

## దత్తాత్రేయ మంత్రము

శ్లో॥ జగదుత్పత్తి కర్తేచ - స్థితి సంహార హేతవే
పావనాశ విముక్తాయ - దత్తాత్రేయ నమోస్తుతే ॥

కడుబడుట సంగువుల ఎది అడుగ పు చులకనవుణావు

## తులసీ మంత్రము

శ్లో॥ యన్మూలే సర్వ తీర్థాని - యన్మధ్యే సర్వ దేవతా
యదగ్రే సర్వ దేవాశ్చ - తులసీ త్వాం నమామ్యహమ్ ॥

## శ్రావణ రాఖీ మంత్రము

శ్లో॥ యేనబద్ధో బలీరాజా - దానవేంద్రో మహాబల
తేనత్వా మభి బద్నామి - రక్షేమా చలమా చలమ్ ॥

## జైన మంత్రము

నమో అరిహంతాణం - నమో సిద్ధాణం - నమో ఆయరియాణం -
నమో ఉవజ్ఝాయాణం-నమోలోయె సవ్వసాహూణం॥
ఏసో పంచన ముక్కారో సవ్వపానప్పణా సణో మంగళాంచ
సర్వేసిం పఢమం హవయి మంగళం ॥

## బౌద్ధ మంత్రము

బుద్ధం శరణం గచ్ఛామి - దర్మం శరణం గచ్ఛామి -
సంఘం శరణం గచ్ఛామి ॥

## శిఖ్ఖు మంత్రము

శ్రీవాహ గురూజీకా ఖాలసా
శ్రీవాహ గురూజీకా ఫతక
బోలే సేవిహోల్ - సత్ శ్రీ అకాల్ ॥

## భారత మంత్రము

శ్లో॥ గాయంతి దేవా కిలగీతకాని
దన్యోస్తుతే భారత భూమి భాగే
స్వర్గాపవర్గా స్పద మార్గ భూతే -
భవంతి భూయ పురుషా సురత్వాత్ ॥

## వనమాల బగవదర్పిత మంత్రము

శ్లో॥ తులసీ కుంద మందార పారిజాతాంబు జైర్యుతాం
వనమాలాం ప్రదాస్యామి - గృహాణ జగదీశ్వర ॥

## గోమాత దర్శన మంత్రము

శ్లో॥ నమో గోభ్య శ్రీమతీభ్య సౌరబే యూభ్య ఏవచ
నమో బ్రహ్మణు తాభ్యశ్చ పవిత్రాభ్యో నమో నమ ॥

## బిల్వదళ సమర్పణ మంత్రము

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం - త్రినేత్రంచ త్రియాయుదమ్
త్రిజన్మ పాప సంహారం - ఏక బిల్వం శివార్పణమ్ ॥

## చంద్ర దర్శన మంత్రము

శ్లో॥ క్షీర సాగర సంపన్న - లక్ష్మీప్రియ సహోదర
హిరణ్మకుల వాసాయ - బాల చంద్ర నమోస్తుతే ॥

## తల్లికి నమస్కరించు మంత్రము

శ్లో॥ నగాయత్ర్యా పరం మంత్ర - నమాతు పరదేవతా
నమారే పరవస్త్రాతా - నాన్యతాత్పాదకం పరమ్ ॥

## వేదవ్యాస మంత్రము

శ్లో॥ కృష్ణ ద్వైపాయనం వ్యాసం - సర్వలోక హితే రతం
వేదాబ్జ భాస్కరం వందే - శమాది నిలయం మునిమ్ ॥

## పరాశర మంత్రము

శ్లో॥ దర్మజ్ఞాం దార్మికం ధీరం - దర్మాత్మానం దయానిధిం
దర్మశాస్త్ర ప్రవక్తారం - పరశర మునిం బజే ॥

## శుక మహర్షి మంత్రము

శ్లో॥ శ్రీ పరాశర పౌత్రం శ్రీ - వ్యాస పుత్రమ కల్మిషం
నిత్యవైరాగ్య సంపన్నం - జీవన్ముక్తం శుకం బజే॥

## వసిష్ఠ మహర్షి మంత్రము

శ్లో॥ బ్రహ్మర్షిర్బ్రహ్మ విద్వర్యో - బ్రహ్మణ్యో బ్రాహ్మణ ప్రియ
తపస్వీ తత్త్వ విద్వాంసు - తం వసిష్ఠ భజేన్వహమ్ ॥

## వాల్మీకి మహర్షి మంత్రము

శ్లో॥ కూజంతం రామరామేతి - మదురం మదురాక్షరం
ఆరూహ్య కవితా శాఖాం - వందే వాల్మీకి కోకిలమ్ ॥

## శక్తి మహర్షి మంత్రము

శ్లో॥ యోగజ్ఞం యోగినాం వర్యం - బ్రహ్మజ్ఞాన విభూషితం
శ్రీకుద్వనిష్ఠ తనయం - శక్తిం వందే మహా మునిమ్ ॥

## మునిత్రయ మంత్రము

శ్లో॥ వాక్యకారం వర రుచిం - భాష్యకారం పతంజలిం
పాణినిం సూత్రకారంచ - ప్రణతోస్మి మునిత్రయమ్ ॥

## ఏకాత్మ మహా మంత్రము

శ్లో॥ ఆకాశాత్పతితం తోయం - యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారం - కేశవం ప్రతి గచ్ఛతి ॥

## నవగ్రహ మంత్రము

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ - మంగళాయ బుదాయచ
గురు శుక్ర శని భ్యశ్చ - రాహువే కేతవే నమ ॥

ప్రతిరోజు నీ వంతుగ కొందరిని బాగుపరచావో విచారించుకో

## కలికల్మష నాశన మంత్రము

శ్లో॥ హరే రామ హరే రామ - రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే ॥

## ప్రదక్షిణ మంత్రము

శ్లో॥ యానికానిచ పాపాని - జన్మాంతర కృతానిచ
తాని తాని ప్రణశ్యంతి - ప్రదక్షిణం పదే పదే ॥

## సర్వ తీర్ధ మంత్రము

శ్లో॥ అకాల మృత్యు హరణం - సర్వ వ్యాధి నివారణం
సమస్త పాప క్షయకరం దేవ పాదోదకం పావనం శుభమ్ ॥

## బోజన మంత్రము

శ్లో॥ అహం వైశ్వానరోభూత్వా - ప్రాణీనాం దేహ మాశ్రిత
ప్రాణాపాన సమాయుక్తా - పచామ్యన్నం చతుర్విదమ్ ॥

## జల ప్రోక్షణ మంత్రము

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి - ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవతేన గంతవ్యం - బ్రహ్మకర్మ సమాదినా ॥

## సంధ్యాదిప మంత్రము

శ్లో॥ దీపం జ్యోతి పరం బ్రహ్మ - దీపం సర్వ తమోపహం
దీపేన సాధ్యతే గంతవ్యం - బ్రహ్మకర్మ సమాధినా ॥

## రాత్రి పరుండు వేళ మంత్రము

శ్లో॥ రామ స్కందం హనుమంతం - వైన తేయం వృకోదరం
శయనేసం స్మరణే నిత్యం - దుస్స్వప్న తశ్య [illegible]శ్యతి ॥

## చెడుకల వచ్చినవేళ మంత్రము

శ్లో॥ శివం దుర్గాం గణపతిం - కార్తికేయం దినేశ్వరం
దర్శం గంగాంచ తులసీం - రాదాం లక్ష్మీం సరస్వతీం ॥

## పిడుగు నివారణ మంత్రము

శ్లో॥ అర్జున ఫల్గుణ పార్ధ - కిరీటి శ్వేత వాహన
బీభత్సుర్వి జయ కృష్ణో - సవ్యసాచి దనం జయ ॥

## ప్రయాణ మంత్రము

శ్లో॥ యత్రయోగే శ్వర కృష్ణో - యత్ర పార్థో దనుర్ధర
తత్రశ్రీ ర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మ మ॥

## హారతి మంత్రము

శ్లో॥ ఈశానా స్సర్వ విద్యానా - మీశ్వర స్సర్వ భూతానాం
బ్రహ్మాధి పతిర్ర్బహ్మో శివోమే అస్తు సదా శివోమ్ ॥
ఓం సహనావవతు - సహనౌభునక్తు - సహ వీర్యం కరవావహై
తేజస్వి నావధీ తమస్తు మా విద్వి శావహై ఓం శాంతి శ్శాంతి శ్శాంతి

## శాంతి మంత్రము

ఓం అసతోమా సద్గమయా తమసోమా జ్యోతిర్గమయా
మృత్యోర్మా అమృతంగమయా - ఓం శాంతి శ్శాంతి శ్శాంతి ॥
ఓం పూర్ణ మద పూర్ణ మిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ - పూర్ణమే వావ శిష్యతే ॥
ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాల యంతాం న్యాయేన మార్గేన
మహీ మహీశా । గోబ్రాహ్మణే భ్యశ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తస్సుఖినో బవంతు ॥

## బీజాక్షరములను జపించుట వలన గలిగెడి ప్రయోజనములు

**ఓం** అని జపించుట వలన నాభి హృదయము కంఠనాళములను ఉత్తేజపరచి శ్వాస కోశములను శుభ్రపరచును కావున ఓంకారము తల్లకన్న మిన్నయని శ్రుతి వాక్యము ప్రాణమును నిలుపు చుండుటచే దీనిని ప్రణవ మంత్రమని పరమేశ్వరుడని ప్రపంచ మంతయు ఓంకారము నుండియే యుత్పన్నమైనది అని యెన్నియెూ విధములుగ మన ధర్మ శాస్త్రములు నొక్కి వక్కాణించుచున్నవి

**ప్రోం** అని జపించుట వలన ముక్కు బొమ్మ జీర్ణకోశములకు పుష్టినిచ్చి గ్రంధులన్నింటికి యౌవనమును గలిగించి వెలిగింప జేయుచుండును

**హ్రీం** అని జపించుట వలన గొంతు గుండె పొట్ట, శ్వాసకోశములు బలపడుటయే గాక రక్తమును వ్యాపింప జేయుచు ఉబ్బసము క్షయ మున్నగు వ్యాధుల నరికట్టి నీరసమును వెలివేసి బలమును చేకూర్చును

**ప్రూం** అని జపించుట వలన లివరు హృదయము పొత్తికడుపు జననేంద్రియముల బాధలు నివారణయైం నొప్పులు హరించి నవ శక్తిని ప్రసరింప జేయుచుండును

**హ్రైం** అని జపించుట వలన మూత్ర పిండములకు బలము కలిగి వ్యాధులు నపుంసకత్వము తొలగి దృఢత్వముండుటకు దోహద పడుచుండును

**ప్రౌం** అని జపించుట వలన మూలాధారము నుండి వెలువడు మలకోశములను శుభ్ర పరచుచు మల బద్ధకమును హరింప జేయుచు దివ్యతేజస్సు నందించు చుండును

**ప్రా** అని జపించుట వలన అంతర్భాగమున నున్న గ్రంధులనన్నింటిని శుభ్రపరచుచు సర్వనాడులకు సంచలనము కలిగించుచు నరముల నీరసత్వమును నిర్మూలించుచు నిత్యానంద పదమునకు చక్కటి బాట నందించుచుండును

పైన పేర్కొనిన బీజాక్షరములేగాక అనేక విధముల బీజ మంత్రములను మనస్సుచే గాని వాక్కుచే గాని జపించుట వలన మనలో నుండెడి ఆధార స్వాధిష్ఠ మణిపూరక అనాహత విశుద్ధ ఆగ్నేయ సహస్ర చక్రముల ప్రకాశింప జేయుచు నవశక్తిని మేలుకొలిపి ఆత్మజ్ఞానానుభూతి నందించి సర్వేంద్రియములను చక్కపరచి బ్రహ్మ సాక్షాత్కార పదవి నందించి శివజీవైక్య సమాధి సూత్రములను దెలపి జననమరణ ప్రవాహముల దొలగింప జేసి మోక్ష మార్గము నందించుచుండును కావున గురు భక్తులు స్త్రీలు పురుషులు అస్వస్థులు అభిలాషులు గృహస్థులు వయోవృద్ధ బాలురు గూడ ఉత్సాహవంతులై అనుభవజ్ఞులనాశ్రయించి తత్సంబంధ విషయముల దెలసికొని పరమ పద సోపాన మార్గమున కాశించి పవిత్ర మానవ జన్మను ధన్యము చేసికొని మహదానందముతో తరించుచు నితరుల తరింప జేయుదురు గాక! యనినా ఆకాంక్ష

## నవగ్రహారాధన



### సూర్య మంత్రము

శ్లో॥ ద్విభుజం పద్మహస్తంచ - వరదం మకుటాన్వితమ్
ధ్యాయేద్ది వాకరం దేవమ్ - సర్వాభీష్ట ఫల ప్రదమ్ ॥

రోగబాధా విముక్తికి ప్రతిదిన ముదయము పలుమార్లు స్తోత్రము చేయవలెను రవి దోష నివారణకు గోధుమలను దానమిచ్చుట శుభము కెంపురాయి ఉంగరంలో ధరించుట మంచిది

## శుక్ర మంత్రము

శ్లో॥ జటిలం సాక్షి సూత్రంచ - వర దండ కమండలం
శ్వేత వస్త్రా వృతం శుక్రం - ధ్యాయే ద్దానవ పూజితమ్ ॥

సుఖ దాంపత్యమునకు ఆయురారోగ్యము గలుగుటకు పఠించవలెను శుక్ర దోష నివారణకు బబ్బర్లు దానమిచ్చుట శుభము వజ్రమును ఉంగరములో ధరించుట మంచిది

## శని మంత్రము

శ్లో॥ నీలాంబరో నీల వపు - కిరీటి గృధ్ర స్థితి శ్చాకరో
ధనుష్మాన్ చుతుర్భుజ స్సూర్య సుత ప్రశాంత
సదాస్తు మహ్యాం వరద ప్రసన్న ॥

కార్యసిద్ధికి గ్రహబలము సంఘ బలము చేకూరుటకు పఠించవలెను శని దోష నివారణకు మరియొక ప్రత్యేక ప్రార్థన

శ్లో॥ నమస్తే కోన సంస్థాయ పింగళాయ నమోస్తుతే
నమస్తే బభ్రు రూపాయ కృష్ణాయత నమోస్తుతే
నమస్తే రౌద్ర దేహాయ - నమస్తే శాంతి కాయచ
నమస్తే యమ సంజ్ఞాయ - నమస్తే సౌరయే విభో
నమస్తే బుధ రక్షాయ - శనేశ్చరాయ నమోస్తుతే
ప్రసాదం మమ దేవేశ - దీనస్య ప్రణతస్యచ ॥

శని దోష నివారణకు నల్ల నువ్వులను దానమిచ్చుట శుభము నీల మణిని ఉంగరములో ధరించుట మంచిది

## రాహు మంత్రము

శ్లో॥ కరాళ వదనం ఖడ్గ చర్మ శూల వరాన్వితం
నీల సింహాసన స్థంచ ధ్యాయే ద్రాహుం ప్రశాంతయే ॥

దారిద్ర్య బాధలు తొలగుటకు అదృష్ట భాగ్యము లబ్బుటకు పఠించవలెను రాహు దోష నివారణకు మినుములను దాన మిచ్చుట శుభము గోమేధికమును ఉంగరములో ధరించుట మంచిది

## కేతు మంత్రము

శ్లో॥ ధూమ్ర వర్ణం ద్విబాహుంచ - కేతుంచ వికృతాననం
గృధ్రాసన గతం నిత్యం - ధ్యాయేత్సర్వ ఫలాప్తయే ॥

చోరాగ్ని పైశాచికాది బాధలు నివారించుటకు పఠించవలెను కేతు దోష నివారణకు ఉలవలను దాన మిచ్చుట శుభము వైడూర్యమును ఉంగరములో ధరించుట మంచిది

**ఒకరికి మాట ఇచ్చి వేరొకరిని పెళ్ళాడితే పురుగువై పుడుదువు.**

# నవగ్రహ జప బీజాక్షరములు

| నవగ్రహ జప బీజాక్షరములు | | జపసంఖ్య |
|---|---|---|
| 1 రవి - | ఓం హ్రాం హ్రీం హ్రౌం స సూర్యాయ | 6 వేలు |
| 2. చంద్ర - | ఓం శ్రాం శ్రీం శ్రౌం స చంద్రమసే నమ | 10 వేలు |
| 3 కుజ - | ఓం క్రాం క్రీం క్రౌం స భౌమాయ నమ | 7 వేలు |
| 4 బుధ | ఓం బ్రాం బ్రీం బ్రౌం సః బుధాయ నమః | 17 వేలు |
| 5 గురు - | ఓం హ్రాం హ్రీం హ్రౌం స బృహస్పతియే నమ | 16 వేలు |
| 6 శుక్ర - | ఓం ద్రాం ద్రీం ద్రౌం స శుక్రాయ నమః | 20 వేలు |
| 7 శని | ఓం ఖ్రాం ఖ్రీం ఖ్రౌం స శనియే నమః | 19 వేలు |
| 8 రాహు - | [illegible] బ్రీం బ్రౌం స రాహువే నమః | 18 వేలు |
| 9 కేతు | ఓం ప్రాం ప్రీం ప్రౌం సః కేతువే నమ | 7 వేలు |

1 ఆరోగ్యమునకు ఆదివారము సూర్యుని జపించవలెను

2. బుద్ధికి మేధస్సునకు సోమవారము చంద్రుని జపించవలెను

3 ఋణ విముక్తికి మంగళవారము కుజుని జపించవలెను

4 వ్యాపార ధనలాభములకు బుధవారము బుదుని జపించవలెను

5 విద్యా, సంతానములకు గురువారము గురుని జపించవలెను

6 అనంత భోగైశ్వర్యములకు శుక్రవారము శుక్రుని జపించవలెను

7 సర్వబాధా నివృత్తికై శనివారము శనిని జపించవలెను

8 అధికారము ఆత్మానందము గురించి రాహు కేతువులను అన్ని వారములలో జపించవలెను

జపమాలను [illegible]

## నవరత్నధారణ

బంగారము వెండి రాగి ఇత్తడి కంచు మొదలగు పంచ లోహములతో గూడిన వాటిలో నవరత్నములను ధరించిన శుభము కలుగును

| రాశులు | | అధిపతులు | నవరత్నములు |
|---|---|---|---|
| మేష | రాశి వారికి | కుజుడు | పగడము |
| వృషభ | రాశి వారికి | శుక్రుడు | వజ్రము |
| మిధున | రాశి వారికి | బుధుడు | పచ్చ |
| కర్కాటక | రాశి వారికి | చంద్రుడు | మంచిముత్యము |
| సింహ | రాశి వారికి | సూర్యుడు | కెంపు |
| కన్యా | రాశి వారికి | బుధుడు | పచ్చ |
| తులా | రాశి వారికి | శుక్రుడు | వజ్రము |
| వృశ్చిక | రాశి వారికి | కుజుడు | పగడము |
| ధనస్సు | రాశి వారికి | గురుడు | పుష్పరాగము |
| మకర | రాశి వారికి | శనేశ్వరుడు | నీలము |
| కుంభ | రాశి వారికి | శనేశ్వరుడు | నీలము |
| మీన | రాశి వారికి | గురుడు | పుష్పరాగము |

పై రాశుల రత్నములను పురోహితులద్వారా మీయొక్క గోత్ర నామములతో బీజాక్షర మంత్రములతో జపాదికములు చేయించి శాస్త్రీయః పద్ధతులతో ఉంగరములలో చేర్పించి ధరించినచో వ్యాపార లాభములు భూ గృహ లాభములు ఇష్ట కార్యసిద్ధి సర్వ జనాకర్షణ రాజకీయ చతురత వాక్పటుత్వము సంపూర్ణారోగ్యము సంతాన సుఖము సర్వతో భద్రత మున్నగు వానిని అందించి మీకన్ని రంగముల యందు విజయమును కలిగించుటయే గాక సర్వ జన రంజకులై సంతృప్తి పరులై జీవితాంతము వరకు సుఖించెదరన్ని శాస్త్ర సమ్మతము-

సర్వేజన స్సుఖినోభవంతు

ఓం శాంతి



**వేశ్యలతో సంబంధము పెంచుకొనినచో పాములతో స్నేహము చేసినట్లు.**



## ఉపాసన - దీక్షప్రక్రియలు

మాలాదారణ దీక్షవహించి వారందరు అనుదినము ఆచరించె విదానాలు

హనుమాన్ దీక్ష వీరబ్రహ్మేంద్రదీక్ష మార్కండేయ దీక్ష వహించిన వారందరు (కఫీల) కాషాయ రంగు దుస్తులు వాడవలయును

శివ దీక్ష రామదీక్ష (శక్తి) అమ్మవారి దీక్ష వహించిన వారందరు పసుపురంగు దుస్తులు వాడవలయును

విఘ్నేశ్వర సరస్వతి దీక్ష వహించిన వారందరు మిల మిలలాడె తెల్ల దుస్తులు వాడవలయును

దత్తాత్రేయ దీక్షవహించిన వారందరు లేతగులాబి రంగు దుస్తులు వాడవలయును

అయ్యప్ప స్వామి దీక్ష వహించిన వారందరు నల్లని దుస్తులు వాడవలయును

శ్రీమన్నారాయణ శ్రీ వేంకటేశ్వర దీక్షవహించిన వారందరు పసుపు రంగు దుస్తులు వాడవలయును

ఏదైన దీక్షాకాలము (మండలం) 41 రోజులకు తగ్గి యుండగూడదు మంచి తిథి వారనక్షత్ర యోగములతో గూడిన శుభదినమున దీక్ష పూనవలయును అన్నిరకముల దీక్షవహించిన వారందరు పట్టు దారమును కుడి ముంజేతి కంకణమును దరించవలయును

108 పూసలుగల తులసి స్ఫటిక మౌక్తిక ప్రవాళము (పగడ) రుద్రాక్ష బద్రాక్ష మాలలను మెడలో దరించవలయును ఏ దేవత దీక్ష వహించారో ఆ దేవతయె సమస్త సృష్టికి మూలమైనదని బావించవలయును

ప్రతిరోజు ఉదయ సాయంత్రములలో చన్నీటితో తలస్నానం చేయవలయును తలకు నూనె వ్రాసుకునుట దువ్వెనతో తల దువ్వుకునడం పనికిరాదు గోళ్ళు తీసుకోవడం క్షౌరము చేయించుకోవడం పనికి రాదు

ఏ దేవుని దీక్ష వహించామో ఆయా దేవుని ఫోటో నిలుపుకొని ప్రత్యేకముగ పూజామందిరమును నిర్మించుకోవలయును అన్యులు ఆ పూజాగదిని ప్రవేశించరాదు మంచి పరిమళ సువాసనలతో పూజామందిరము ప్రకాశించవలయును మామిడి చెక్కతో చేసిన పీరవేసి తాను ఏరంగు దుస్తులు దరించారో ఆ రంగు బట్టనే పీఠపై పరచి ఆయా పోటోను బెట్టి బియ్యమును బోసి చతురస్రముగ నేర్చి షట్కోణము ముగ్గు వేసి మూడు రంగులతో అలంకరించి నిర్మించి ముగ్గు మధ్యలో రాగి చెంబు (కలశము) నీళ్ళతో తమ్మల పాకులతో సుగంధ ద్రవ్యములతో కొబ్బెరకాయను పెట్టి కలశ ప్రతిష్ఠ చేయవలయును

41 రోజులు ఆరిపోకుండ ఉండుటకై పెద్ద చిప్పలలో నెయ్యి బోసి టెంకాయగొట్టి అఖండదీపము వెలిగించి 41 రోజులు జాగ్రత్తగ దీపమును కాపాడుకోవలయును

దీక్షా దేవతల మంత్రములను ఉదయ సాయంత్రములలో పూటకు ఒక వెయ్యి ఒక నూటా ఎనిమిది సార్లు రెండు పూటల జపము చేసి షోడశోపచార పూజలు దూపదీపాది నైవేద్యములు సమర్పించవలయును

(కృష్ణాజినము) జింక చర్మము దర్భచాప లేక తెల్ల గొంగడి తెల్ల బట్టపై సుఖా సనముతో కూర్చుండి నిష్ఠతో మనస్సు నేకాగ్రపరచి జపముచేయవలయును

పసుపు కుంకుమ త్రిచూర్ణము తిరుమణి శ్రీగందం అష్టగందం విభూతి కస్తూరి మొదలగునవి నుదుట ఇష్టానుసారము దరించవలయును

మంచమును ఇతరుల దుస్తులను స్త్రీలను అంటగూడదు తన పడక బట్టలను ప్రత్యేకముగనుంచుకోవలయును తలదిండు లేకుండ నేలపై ఏకాంతముగ నిద్రించవలయును చీకటింటిలో నిద్రించరాదు

టీ వీ సినిమా విందులు విలాసాలు దాంపత్యము స్త్రీలతో ముచ్చటించుట పాదరక్షలు దరించుట అదిక వాచాలత్వము అదిక బోజనము అధిక నిద్ర అబద్ధమాడుట (వామ మార్గము) చాటు పనులు చేయుట పనికిరావు

(ఏకభుక్తము) ఒకే పూట మద్యాహ్నన్నము భుజించవలయును స్వయముగ తానే వండుకో వలయును ప్లేట్ తలె కంచములో బోజనము పనికిరాదు విస్తారులో భుజించవలయును అవసరమైతే (అపక్వాహారము) ఉడుకని పదార్థాలు పండ్లు ఖర్జూరలు పల్లీలు నీళ్లలో నాన బెట్టిన మంచి శనగలు పచ్చి ఆకులు కాయలు కూరలు వాడవలయును

వాహన గమనము పనికిరాదు  పాదయాత్రలు చేయవలయును దీక్ష వహించిన దేవతల ఆలయాలు పాడుబడినచో వాటిని పునరుద్ధరించవలయును  ప్రతిరోజు ఉదయ సాయంత్రములలో ఆలయాల దర్శించి (9) ప్రదక్షణలు చేయవలయును  ఏ దేవత దీక్ష వహించారో ఎదుటివారిని ఆయా దేవతస్వరూపాలని బావించి ఒకరినొకరు అబినందించుకోవలయును  ఎట్లనగా స్వామిశరణం జై హనుమాన్ జై శ్రీరాం జై బవాణి జై దత్తావదూత ఓం నమశ్శివాయ జై వేంకటేశ్ హరి ఓం ఇలా సంబాషించుకోవలయును

ఆడంబరాలు అనుమానాలు అవిశ్వాసాలు ఉండగూడదు శాంతము ఓర్పు శీలము సత్యము వినయములుండవలెను జాతి కుల మత వర్గ బేదములుండరాదు  అన్నిరకముల వ్యాపారములు చేసుకొని అన్ని రకముల ఆద్యాత్మిక సదస్సులలో పాల్గొనవచ్చును

చుట్టా బీడి సిగరేటు తాంబూలాలు వాడరాదు వార్తా పత్రికలు నవలలు సినిమాలు చిత్రపటాలు చూచుట వినుట పనికిరాదు

ఆయా దీక్షాదేవతల చరిత్రలు పూజాగ్రంథములు వేద పఠణమును బక్తుల చరిత్రలు చదువుచు బజనలు చేయవలయును

బ్రహ్మీముహూర్తమున ప్రతిరోజు సామూహికముగ నగరసంకీర్తన వాయిద్యములతో లేక కరతాళ ద్వనులతో గాని చేయవలయును

దీక్షా విరమణ సమయమున యదోచితముగ అన్నదానము చేసి మెడలోనున్న మాలను ముంజేతికంకణమును విసర్జించవలయును తదనంతరం అబాగ్యులకు వికలాంగులకు  శక్తికొలది దానదర్మములు చేయవలయును  కలశముపై పెట్టిన కొబ్బరకాయను పీఠపై వేసిన క్రొత్త బట్టలో ముడిబెట్టి అలంకరించి గుమ్మము ముందుగాని లేక దరువాజలోపలిబాగములో ఇంటిలో కట్టుకోవలయును  దీక్షాకాలమున ఆరోగ్యంలోపించినచో ఔషదములు వాడకూడదు

# దీక్షా జప బీజాక్షర మంత్రములు

| | |
|---|---|
| గణపతి దీక్ష | ఓం గంగం గణపతయేనమ |
| సరస్వతి దీక్ష | ఓం శ్రీం క్లీం ఐం వాణియేనమ |
| హనుమాన్ దీక్ష | ఓం హనుమతే రామ దూతాయనమ |
| వీరబ్రహ్మేంద్ర దీక్ష | ఓం హ్రీం క్లీం శ్రీం వీరబ్రహ్మేంద్రాయనమ |
| మార్కండేయ దీక్ష | ఓం ముని నాథాయ మార్కండేయాయనమ |
| శివ దీక్ష | ఓం నమ శివాయ (శివాయనమ ) |
| శ్రీరామ దీక్ష | ఓం వ్రోం హ్రీం రాం రామాయనమ / (ఓం శ్రీ రామాయనమ ) |
| అమ్మవారి దీక్ష | ఓం ఐం హ్రీం క్లీం చాముండాయైవిచ్చే |
| దత్తాత్రేయ దీక్ష | ఓం బ్రహ్మ విష్ణు శివాత్మక శ్రీగురుదేవదత్త |
| శ్రీమన్నారాయణ దీక్ష | ఓం నమో నారాయణాయ |
| శ్రీ వేంకటేశ దీక్ష | ఓం శ్రీ వేంకటేశాయనమ |

పై వాటి నన్నింటిని గురు ముఖమున తెలుసుకొని అనుష్ఠించి అనుభవము పొంది తరించుదురుగాకయని మా ఆకాంక్ష

ఇట్లు
మీ శ్రేయోభిలాషి
**గోశికొండ మురారి పంతులు**

॥ లోకాసమస్తస్సుఖినోభవంతు ॥

# ఎంకయ దేవ

ఎంతటి గుణవంతుడవో ఎలుకవాహన నీ
వింతలెన్నతరమౌనా వెంకయదేవా ని
న్నేనాటికి మరువమురా పలగరారా ॥ఎం॥

నవ్వుకొనుచు నీతల్లి నలుగు పిండి బొమ్మజేసి
ప్రాణాలు బోసి ద్వారపాలకునిగ నియమించె
తల్లి యాజ్ఞ పాటించి తండ్రిని ఎదురించబోయి
తల ఊడి కిందపడి విలవిలపడి పోయితివి ॥ఎం॥

ఎక్కడొ పడి మరణించిన ఏనుగుతలకాయదెచ్చి
దండిగ నీమొండెమునకు తగిలించగ లేచితివి
గుట్టంతటి దేవుడవై చిట్టెలుకను యెక్కితివి
మొట్టమొదట తల్లిదండ్రుల మ్రొక్కి వరాలందితివి ॥ఎం॥

ఆరు ముఖాలున్నవాని కగ్రజుండవైనావు
హరుడే నీ తండ్రిగారు। ఆదిపరాశక్తి తల్లి।
పుట్టెడు బుద్ధులు గలిగి పొట్టివాడవైనావు
పట్టుబట్టి నిను గొలచిన పాపలే తొలుగునంట ॥ఎం॥



# లింగాలయ్య

ఏవిధి పూజింతురా శివ శివ!
ఏమని ప్రార్థింతురా హర శివ! ॥ఏ॥

చరణ పూజలే జరుపుదమంటె
శివతాండవమును చేయుచుంటివి
కరములు బట్టుక వేడెదమంటె
ఢమరత్రిశూలము పట్టుకొంటివి
పీఠవేసి పూజించెదమంటె
యెద్దు నెక్కి తిరుగాడుచుంటివి ॥ఏ॥

హృదయంబును పూజించెదమంటె
ఉమాదేవినే నిలుపుకొంటివి
కంఠంబును పూజించెదమంటె
కాలసర్పమును చుట్టుకొంటివి
నేత్రమ్ముల పూజించెదమంటె
అగ్నినేత్రమున అగుపడుచుంటివి ॥ఏ॥

శిరము చూచి పూజించెదమంటె
చందమామనే బెట్టుకొంటివి
జడలచూచి పూజించెదమంటె
గంగమ్మను జడముడుచుకొంటివి
ఆకారముగని మ్రొక్కెదమంటె
దిగంబరుడవై నిలచియుంటివి ॥ఏ॥

జయాపజయములు ఈశ్వరాధీనములు ప్రయత్నించుము

# అయిగిరినందిని

॥దేఖ్ తెరీ సంసార్‌కి హాలత్ క్యాహోగయా భగవాన్ కితనా బదల్ గయా ఇన్సాన్॥

అఖిలాండేశ్వరి! అయిగిరినందిని!
ఆశ్రితపావనివే! అమ్మ నిన్నారాధించెదనే!
సకలమునిండిన శాంకరిదేవి
శారదాంబనీవే! అమ్మనిన్నారాధించెదనే! ॥అఖి॥

పులి నీప్రక్కన నిలబడియుంటె
కొలిచేదెటు మది జంకుచునుండె
గళమున పుర్రెల మాలలు వుంటె
విలవిల తనువు వణుకుచునుండె
తలచుకున్న నీ రూపము చూచి తాళజాలనమ్మ
భక్తితో కొలువగ లేనమ్మ ! భక్తితో కొలువగ లేనమ్మ !! ॥అఖి॥

నీలి కాంతితో నిలబడియుంటె
కాళికాంబవై కనబడుతుంటె
కాళభైరవుని త్రొక్కుచునుంటె
కనులలో నిప్పులు గ్రక్కుచువుంటె
తలచుకున్న నీరూపము చూచి తాళజాలనమ్మ!
భక్తితో కొలువగలేనమ్మ! భక్తితో కొలువగలేనమ్మ!! ॥అఖి॥

చేతలు గొప్పగా చేసి మాటలు కొద్దిగాం చెప్పుము

బీతి జెందునీ రూపమె వద్దు
ప్రీతి గూర్చు నీ నామమె ముద్దు!
భూత ప్రేతముల వేషమెవద్దు
మాతా నిన్నేగొలుచుటె ముద్దు
మా తల రాతలమార్చేతల్లి! పూతచూపకమ్మ !
ఈశ్వరి! గతి నీవేనమ్మ! ఈశ్వరి! గతి నీవేనమ్మ! ॥అఖి॥

పర్వత రాజ సుపుత్రివి నీవే!
పరమేశ్వరునకు రాణివి నీవే!
సర్వజనుల కాధారము నీవే!
శాంభవీ త్రిపుర సుందరి నీవే!
అంబనీవె! జగదాంబవురావె! ఆశ్రితపావనివే
మురారిని ఆదరించరావే! మురారిని ఆదరించరావే! ॥అఖి॥



# సంస్తుతి

మదిలో ప్రార్థించెదా నిన్నే
ఎదలో ద్యానించెదా నా ||మ||

పరమేశ్వర నను పరిపాలించరా
కరుణారస పరిపూర్ణకృపాకర ! ||మ||

అనువులోన పరమాణువులోన
కనబడుచుంటివి గరళకంధర !
నీ స్వరూపమే నిఖిలము నిండెను
ఇహ పర సుఖముల నొసగెడి దేవా ||మ||

చీమలయందున సింహములందున
జీవమునీవై జగతినేలితివి
అండపిండ బ్రహ్మాండనాయకా!
ఆది దేవ ! నా ఆత్మస్వరూపా ! ||మ||

విశ్వములో స్త్రీ పురుషుడ వీవె!
విశ్వమోహనా రూపము వీవె!
విష్ణు జిష్ణు ప్రభు! విశ్వపాలకా!
విమలచరిత ! సద్గుణ హే భరిత ! ||మ||

---

క్షణకాలం గలిగిన ఏకాగ్రతయే ఎనలేని ఆనందం

# భవాని

అంబా భవాని శంభుని రాణి
హారతి చేకొను పల్లవ పాణి
నిన్నే ప్రార్థించెదా దేవి
నిన్నే ద్యానించెదా ॥అం॥

ఆదిశక్తివే ఆత్మ రూపివే
అమ్మా మమ్ముల ఆదరించవే
ఇంద్రకీలాద్రి యింపుగ జేరి
విజయవాడలో కనకదుర్గవె ॥అం॥

మి॥ కాళి నీవె మహాకాళివినీవె
కాశి అన్నపూర్ణమ్మవు నీవె
ఏలుకొనుము నీ పాలబడితిమి
ఎన్నో రూపము లెత్తితివమ్మ ॥అం॥

సంపదలొసగెడి శ్యామలాంబవే
శక్తినొసంగెడి చండికాంబవే
గంగాధరుని హృదయ వాసిని
శృంగేరీ పుర భువన సుందరి ॥అం॥

మి॥ భువిలో నీసాటెవరులేరని
నవరాత్రులు నిన్నారాధించెద
భవములన్ని తొలగించు ఓంనమో
భవాని భైరవి మురారి పోషక। ॥అం॥



# అంతర్యామి

1 దేహము లేనివాడై-దేహములలో నివసించువాడు
2 దేనిని కోరని వాడై-కోరినదిచ్చువాడు
3 మౌనముగ తానుండినవాడై-భరించలేని శబ్దంగలవాడు
4 అవయవములు లేనివాడై-అంతట నిండినవాడు
5 తనను ఎవరుచూడకున్న-తానందరిని చూచువాడు
6 తానేకమైయుండి-అనేక మొసంగువాడు
7 తాను కనిపించనివాడై-కనిపించుదానిని కదిపించువాడు
8 ఉత్పత్తి స్థితి లయకారకుడై-యుండియు కూడా- లేనివాడు
9 ఆద్యంతము లెరుగనివాడై-జగతిని నడిపించువాడు
10 అవినాశుడు! అంతర్యామిడు! ఆనందస్వరూపుడు !





ఓం సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై-తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై, ఓం శాంతిః శాంతిః శాంతిః

